sunday magazine

18 డిసెంబర్ | 2016

# ఆదివారం ఆంధ్రజ్యోతి



## వెయ్యావుల కుటుంబం!



## జయ జ్ఞాపకాల తోటలో..

# చలికాలం.. తారాలోకం!

చలికాలం వచ్చిందంటే స్వెట్టర్లు, వింటర్ జాకెట్లు బయటకు తీయాల్సిందే ఎవరైనా. షూటింగుల్లో పాల్గొనేందుకు బయటకు వచ్చే స్టార్లు సైతం ఈ విషయంలో ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటుంటారు. అయితే పబ్లిక్‌లో కనిపిస్తారు కాబట్టి ప్రతీది స్టయిలిష్‌గా ఉండాలనుకుంటారు. షూటింగ్‌ల కోసం విదేశాలకు వెళ్లినప్పుడు హీరోయిన్లు షాపింగ్‌లో వింటర్ కలెక్షన్స్ వెంట తెచ్చుకుంటారు. వాటిని ధరించి బాలీవుడ్ హీరోయిన్లు విమానాశ్రయాల్లో, ఫంక్షన్లలో కనిపించిన దృశ్యాలివి. ఎవరి స్టయిల్ వారిదే. పనిలోపనిగా ఎవరి స్టయిల్ అదిరిందో చెప్పేయండి.







ఫిల్మ్‌నగర్











## ఇండెక్స్




ఆదివారం
18 డిసెంబర్ 2016
ఆంధ్రజ్యోతి


## ఇన్‌బాక్స్

### డబ్బుకు లోకం దాసోహం

పెద్ద నోట్ల రద్దుతో దేశమంతా కరెన్సీ కష్టాలు అనుభవిస్తున్న సమయంలో వచ్చిన 'డబ్బురా... లబ్ డబ్బురా..' సందర్భోచితంగా ఉంది. మనిషి తయారుచేసిన రూపాయి, ఆ మనిషినే తన చుట్టూ తిరిగేలా చేసుకుంది. ఎన్ని నీతిమాటలు చెప్పినా లోకం డబ్బుకు దాసోహం అంటుందనేది కాదనలేని నిజం. డబ్బు పుట్టుక, దాని పరిణామ క్రమం మొదలైన విషయాలను చాలా చక్కగా వివరించారు. కరెన్సీకి ప్రత్యామ్నాయంగా ఈ-క్యాష్, మొబైల్ వ్యాలెట్లు, ఆన్‌లైన్ చెల్లింపులు, తదితర ఎన్నో రకాల ఆధునాతన సౌకర్యాలు ఇప్పుడు అందుబాటులో ఉన్నాయి. వాటి గురించి కూడా తెలిపి ఉంటే ప్రజలకు ఎంతో ప్రయోజనకరంగా ఉండేది.

– **లక్ష్మీ పద్మజ,** హైద్రాబాద్; **బి. అశోక్,** కృష్ణాపూర్

### ఆడవారి అవస్థలు ఆవిష్కృతం

ఈ వారం కథ 'సవారీ జడుపు..!' చదివాను. తూర్పు ఆంధ్ర ప్రభువుల ఇళ్లల్లోనివారు పాటించే మర్యాదలతో, 'అమ్మయ్య- బావుజీ' పిలుపులతో నాకు పరిచయముంది. చింతకింది శ్రీనివాసరావు కథ చిత్రణ చాలా బాగుంది. పెట్టె పల్లకీలో ముడుచుకుని కూర్చునే తల్లులకు దారిలో కాలు ముడుచుకునే అవకాశం లేని జాలి స్థితి గురించి అతి సున్నితంగా రాసిన కథ ఇది. ఒకప్పటి యదార్థ స్థితిని తెలియచెప్పిన కథ. నాకున్న రాణివాస స్త్రీల పరిచయం వల్ల కథలో చిత్రితమైన పరిస్థితి ఇప్పుడు లేదని చెప్పగలను. అనంతమూర్తి 'సంస్కారా'లాగా ఇది ఒక కాలం చెల్లిన ఇతివృత్తం. అయితే 'కన్యాశుల్కం'లో లాగా ఇందులో ఈ కాలానికి చెందిన విషయమూ లేకపోలేదు. అది ప్రయాణం చేసే స్త్రీలకి, ఉద్యోగం చేసే స్త్రీలకి లేకపోతున్న ఆ సౌకర్యం.

– **శర్మ కందుల,** ఈమెయిల్

●●●

ఈ వారం కథ 'సవారీ జడుపు' ఆలోచింపచేసేదిగా ఉంది. ఇప్పటి మహిళలు పడుతున్న కష్టాలకు రాజుల కాలంలోనే మూలాలు ఉన్న విషయాన్ని నిగూఢంగా తెలియజేశారు రచయిత. 'గతం నాస్తి కాదు అనుభవాల ఆస్తి' అంటారు పెద్దలు. ఆ ఆస్తి ఆచార, సంప్రదాయాల పేరిట స్త్రీల మీద మోయలేని భారాన్ని మోపుతున్నది. అలాంటి దిక్కుమాలిన పాత దుస్తులను 'మార్పు, చైతన్యం' అనే సరికొత్త సబ్బులతో ఉతికితేనే మంచిది. ఆ పనికి ఈ కథ దోహదం చేస్తుందనుకుంటున్నాను. మంచి సందేశాన్ని అందించిన చింతకింది శ్రీనివాసరావు గారికి అభినందనలు.

– **వై. నాగేశ్వరరావు,** విశాఖపట్నం

### నిజమైన 'చాందిని'

'చాందిని 16ఎఫ్, ది ఎడిటర్' కథనం చాలా బాగుంది. చిత్తుకాగితాలు ఏరుకునే స్థాయి నుంచి 'బాలక్‌నామా' అనే పత్రికకు ఎడిటర్ అయిన చాందిని జీవితం నేటి విద్యార్థులకు స్ఫూర్తిదాయకం. చిన్న చిన్న కారణాలకే మనస్థాపానికి గురై ఆత్మహత్యలకు పాల్పడుతున్న విద్యార్థులకు ఓ మంచి పాఠం. తనకు లభించిన చిన్న అవకాశాన్ని వినియోగించుకుని ఆ పదహారేళ్ల అమ్మాయి సాధించిన విజయం అపూర్వం. హేట్సాఫ్ టు చాందిని.

– **వద్ది దుర్గారావు,** ఎల్ఎన్‌డీ పేట;
**బోనమౌని ప్రభాకర్,** బెల్లంపల్లి

### 'తాను- నేను' నచ్చింది

చిన్న పాటలో చెప్పలేనంత భావాన్ని నింపే అనంత శ్రీరామ్ గారు తన అనుభవాలను వర్ణించిన తీరు అద్భుతం. 'తాను- నేను' పాట మనసుకు నచ్చే పాట. అయితే ఆ పాటలో ప్రతి పదానికి ఇంత అర్థం ఉందని ఈ కథనం చదివే తెలుసుకున్నాం. భవిష్యత్‌లో ఇలాంటి మరెన్నో మంచి పాటలు ఆయన కలం నుంచి రావాలని కోరుకుంటున్నాం.

– **రోహిత్ అక్కలదేవి,** ఈమెయిల్

### నిజమే.. 'ఏం మారలేదు!'

ఈ వారం కవితలు చాలా బాగున్నాయి. నిజంగా 'ఏం మారలేదు' రూపాయి. రద్దు చేసినా రాజీపడనంటోంది అవినీతి. ఏలుతున్న రాజులు కొన్ని రోజులు ఆగమని చెప్పినా ఆగనంటోంది ఆకలి. రూపాయికి అసలైన అర్థం చాలా బాగా వివరించారు రచయిత బాలసుధాకర్ మౌళి. కె. శివారెడ్డి గారి 'ఎక్కడ' కవిత కూడా భావస్ఫోరకంగా ఉంది.

– **శాంతమూర్తి,** హైద్రాబాద్; **ఎస్. కృష్ణబాబు,** పాలకూర్

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.






'అర్థక్రాంతి ప్రతిష్టాన్' బృందం



# దేశాన్ని క్యూలో నిలబెట్టాడు!

నల్లడబ్బు మీద 'సర్జికల్ స్ట్రయిక్' అంటూ ప్రధాని మోదీ పెద్ద నోట్లను రద్దు చేసిన చేసిన సంగతి తెలిసిందే. అయితే మోదీ తీసుకున్న ఈ వివాదాస్పదమైన నిర్ణయం వెనుక ఉన్నది ఎవరో తెలుసా?అనిల్ బోకిల్ అనే సామాజిక కార్యకర్త. గత జూలైలో పుణేకు చెందిన అనిల్ తన 'అర్థక్రాంతి ప్రతిష్టాన్' బృందంతో ప్రధానీ మోదీని కలిశారు. దేశంలో అవినీతి సొమ్మును అంతమొందించేందుకు ఏం చేయాలనే విషయమ్మై మాట్లాడేందుకు ప్రధాని ఈ బృందానికి కేవలం 9 నిమిషాల సమయం ఇచ్చారు. అయితే అనిల్‌తో ఆయన 2 గంటలపాటు చర్చించడమేగాక ఆ తర్వాత నల్లడబ్బుపై సర్జికల్ స్ట్రయిక్ చేయాలన్న నిర్ణయం తీసుకున్నారు. ప్రస్తుతం జనం బ్యాంకుల ముందు క్యూలు కట్టడానికి అచ్చంగా అనిల్ ఆలోచనే కారణమని చెప్పవచ్చు. అయితే తన ఆలోచనను సగం మాత్రమే అమలు చేయడం వల్ల ఈ ఇబ్బందులు తలెత్తాయని అనిల్ అంటున్నారు.

అనిల్ బోకిల్ మరట్వాడా ప్రాంతానికి చెందినవాడు. అతని తల్లిదండ్రులు లాతూరులో ఉపాధ్యాయులుగా పనిచేసి పదవీ విరమణ చేశారు. 1995లో జరిగిన ఒక సంఘటన మెకానికల్ ఇంజనీరైన అనిల్ ఆలోచనా విధానాన్ని మార్చింది. 86 మంది కార్పెంటర్లు, వెల్డర్లు, ఎలక్ట్రీషియన్లు, లోహపు పనివారు చిన్న చిన్న వ్యాపారాలు చేసుకునేందుకు ఔరంగబాద్‌లోని ఒక బ్యాంకును అప్పడిగితే ఆ బ్యాంకు నిరాకరించింది. అనిల్ వారి కేసును బాగా స్టడీ చేసి ఒక ప్రాజెక్టు రిపోర్టు తయారుచేసి బ్యాంకుకు ఇచ్చారు. ఆ ప్రాజెక్టుతో సంతృప్తి చెందిన బ్యాంకు వారిలో ఒక్కొక్కరికి 50 వేల రూపాయల నుంచి రెండు లక్షల రూపాయల దాకా అప్పులిచ్చింది. రెండేళ్లలో మరికొన్ని బ్యాంకులు కూడా అదే విధంగా మైక్రో క్రెడిట్, మైక్రో ఫైనాన్స్‌లు ఇచ్చేందుకు ముందుకొచ్చాయి.

దేశంలో ప్రతి ఒక్కరికీ బ్యాంకులు ఎందుకు అందుబాటులో ఉండవు? ఎందుకు లోన్లు  ఇవ్వవనే అంశాలపై ఆ తర్వాత అనిల్ చాలామంది ఆర్థిక వేత్తలను, చార్టెర్డ్ అకౌంటెంట్లను కలిసి చర్చించారు. 1999లో 'అర్థక్రాంతి'కి రూపకల్పన చేసి చాలామందిని అందులోకి ఆహ్వానించారు. "అనిల్ బోకిల్‌ని నేను 2007లో సకాల్ మరాఠీ దిన పత్రికకు ఇంటర్వ్యూ కోసం వెళ్లినప్పుడు కలిశాను. దేశ ఆర్థిక ఫలాలు సామాన్యుడికి అందాలని ఆయన చేస్తున్న కృషి నన్ను ఆకర్షించింది. అందుకే ఆయనతో కలిసి ముందుకెళ్తున్నాను" అని యమజీ మాల్కర్ అన్నారు. గత పదేళ్లుగా ఆయన 'అర్థక్రాంతి ప్రతిష్టాన్' ట్రస్టీలలో ఒకరుగా ఉన్నారు. అంతేగాక సంస్థ ప్రచురిస్తున్న 'అర్థపూర్ణ' మాస పత్రికకు ఎడిటర్‌గా కూడా పనిచేస్తున్నారు.

మాల్కర్‌లాగే ఎంతోమంది మేధావులు 'అర్థక్రాంతి'లో స్వచ్ఛందంగా పనిచేస్తున్నారు. వారందరూ కలిసే దేశ ఆర్థిక వ్యవస్థను చక్కదిద్దేందుకు ఒక ప్రాజెక్టును తయారు చేశారు. దాన్ని తీసుకుని అనిల్ బృందం రాహుల్‌గాంధీ, ప్రతిభాపాటిల్, సోమనాథ్ చటర్జీ వంటివారిని అనేకసార్లు కలిశారు. తమ మోడల్‌ను పార్లమెంట్‌లో ప్రదర్శించేందుకు అనుమతి కోరారట గాని అవకాశం దొరకలేదట. అయితే మోదీ వారికి అవకాశం ఇవ్వడమేగాక వాళ్ల సలహాపై పెద్ద నోట్ల రద్దు కూడా చేయడంతో 'అర్థక్రాంతి' పేరు ప్రస్తుతం దేశంలో మారుమోగుతోంది.

"అయితే మేము రూపొందించిన 'టాక్స్‌లెస్ అండ్ లెస్‌క్యాష్ ఎకానమీ'లోని 5 పాయింట్లలో ప్రభుత్వం కేవలం 2 మాత్రమే- అదీ పాక్షికంగా తీసుకుంది. మిగతా 3 కూడా తీసుకుని అమలు పరిచి ఉంటే ప్రజలకు ఈ ఇక్కట్లు వచ్చేవి కావు. అందుకే ప్రధాని మోదీ హఠాత్తుగా తీసుకున్న ఈ నిర్ణయాన్ని మేము స్వాగతించడం లేదు, అలాగని తిరస్కరించడం లేదు. ఇదొక ఉద్యమం... ఇందులో అందరూ పాల్గొంటే తప్పకుండా ఫలితాలుంటాయి. ఇప్పటి పరిస్థితి ఏమిటంటే అనస్తీషియా ఇవ్వకుండా ఆపరేషన్ చేసినట్లుగా ఉంది" అంటున్న అనిల్ బోకిల్ ఇప్పటికీ బ్రహ్మచారిగా ఉంటూ ఊరి నుంచి తన తల్లి పంపు తున్న డబ్బుతోనే నిరాడంబరంగా జీవిస్తుండటం విశేషం.











### ('అంతులేని కథ' చిత్రంలోని 'దేవుడే ఇచ్చాడు వీధి ఒకటి' పాటకు)

**దే**వుడే ఇచ్చాడు సెల్లు ఒకటి
ఇక పుడ్డేల .. నాకు బెడ్డేల .. ఓ మిత్రమా!
నాకిదే లోకం .. నా కిదే ప్రాణం .. /దేవుడే/

స్నేహితులు నన్నడిగి కొన్నారా?
నా పిల్లలే నన్నడిగి కొంటారా?
పాపం పుణ్యం నాది కాదు పోరా పిచ్చోడా
కష్టపడి ఇన్వెంట్ చేసిన సైంటిస్ట్ ఎవడోరా



ఫస్టు జోషే .. పిదప మతాషే ..
ఈ జీమెయిల్సు .. ఉత్త నాన్సెన్సు ఓ మిత్రమా! /దేవుడే/

వాట్సప్ చూస్తుంటే నాకు హాపీ
మరి ఫేస్‌బుక్ అకౌంట్ నా హాబీ
చాటింగ్ చేస్తూ మర్చేపోతా ఈ ప్రపంచం
మీటింగ్‌లన్నీ ఛాటింగ్‌తోనే ఉన్నాయ్ విను కొంచెం
సెల్లు నాదె .. జేబు నాదె ..
దీని బిల్లెంత? జేబు చిల్లెంత .. ఓ మిత్రమా! /దేవుడే/

తెలిసేట్లు చెప్పావు ఓ మిత్రమా
వినివుంటే బావున్ను ఓ నేస్తమా!
సెల్లు లోన జీవితాన్ని వెతికే వెర్రోడా!
నీకు నువ్వే దూరం అయ్యావ్ చూడర చిన్నోడా!
ఏది సత్యం? ఏది పైత్యం?
ఈ మమకారం .. ఒట్టి గ్రహచారం ఓ మిత్రమా! /దేవుడే/

**- జి. రంగబాబు, 94401 90669**

## శునక పంచ నామావళి



వేటకెళ్లేటప్పుడు - వేపి
గ్రాంథికంలో - శునకం
పోలీసు భాషలో - జాగిలం
పెంపుడు పేరు - టామీ
వీధిలోనయితే - ఊరకుక్క
(పై పంచ నామావళి రాత్రి పదిసార్లు పఠించి నిద్రపోతే దొంగల భయం ఉండదు!)

## ఎవరు గొప్ప?




**"ఇం**గ్లీషు వాళ్లు గొప్పవాళ్లా, లేక భారతీయులా?"
"భారతీయులే!"
"ఎలా?"
"వాళ్లు మన మాతృభాషలో మాట్లాడుకోలేరు. కానీ మనం వాళ్ల మాతృభాషలో మాట్లాడుకోగలం!"

**- నెల్లుట్ల సుదర్శనరావు,** ప్రగతినగర్, హైదరాబాద్ - 90

## క్యా డైలాగ్ హై



• పెళ్లయ్యాక కూతుర్ని వేరే వాళ్ల ఇంటికి పంపాలని ఎవడు రాశాడో కానీ వాడికి కచ్చితంగా కూతురు ఉండి ఉండదు.

- చిత్రం : **నేను.. శైలజ...**



• మనకన్న పెద్దవాళ్లంటే గౌరవం ఉండాలి. మన వయసు వాళ్లతో పోటీ ఉండాలి. మనకంటే చిన్నవాళ్ల పట్ల ప్రేమ ఉండాలి.

- చిత్రం : **నువ్వే నువ్వే**

**- షేక్ అస్లాం షరీఫ్,** శాంతినగర్



'ఊర్వశి' శారద



జయ జ్ఞాపకాల తోటలో..

**కథానాయిక నుంచి 'విప్లవనాయిక'గా ఎదిగిన జయలలితతో తమకున్న అనుబంధాన్ని పంచుకుంటున్నారు 'ఊర్వశి' శారద, సీనియర్ నిర్మాత మురారి, నటి గీతాంజలి. దివంగత జయలలిత గురించిన వారి జ్ఞాపకాల తోటలోకి పదండి...**

# వారిద్దరి కలబోత జయలలిత!

1974లో మేమిద్దరం అక్కినేని నాగేశ్వరరావు హీరోగా నటించిన 'ప్రేమలు - పెళ్లిళ్లు' అనే చిత్రంలో హీరోయిన్లుగా చేశాం. ఆ తరువాత మళ్లీ ఆమెతో కలిసి నటించే అవకాశం రాలేదు. నేనెంతోమందితో నటించాను. కానీ జయలలితను మాత్రం జీవితంలో మరచిపోలేను. ఆమె సెట్‌లోకి వచ్చే తీరు, ఆ స్టయిలే సపరేట్‌గా ఉండేది. అప్పట్లోనే ఆమె తీరు, వ్యవహారశైలి ప్రత్యేకంగా ఉండేది. ఎంత పెద్ద డైలాగ్ ఇచ్చినా సరే స్క్రిప్టు పేపర్స్ చూడకుండా ఒకసారి అసిస్టెంట్ డైరెక్టర్‌ను చదవమనేవారు. విన్న వెంటనే 'ఓకే... కమాన్' అంటూ షాట్‌కు రెడీ అయిపోయేవారు. అది కూడా ఒక్కటేక్‌లోనే ఓకే చేసేవారు. 'అంత పెద్ద డైలాగ్‌ను ఒక్కసారి చెబితే ఎలా పట్టేసిందబ్బా ఈవిడ' అని మేమంతా ఆమె జ్ఞాపకశక్తికి ఆశ్చర్యపోయేవాళ్లం. ఆమె డ్యాన్సులు కూడా బ్రహ్మాండంగా చేసేవారు. అయితే కో ఆర్టిస్టులతో ఎక్కువగా మాట్లాడేవారు కాదు. అది చూసి ఆమెకు గర్వమని చాలామంది అనుకునేవారు. కానీ అది పొరపాటు. ఆమె మనస్తత్వాన్ని అర్థం చేసుకుంటే జయలిలత అంటే ఏమిటో తెలుస్తుంది.

### పుస్తకాల పురుగు ...

జయలలిత సెట్లో అందరితోనూ స్పష్టమైన తెలుగులో మాట్లాడేవారు. ఇతర భాషల వారు వుంటే వారి మాతృభాషలోనే మాట్లాడేవారు. ఆమెకు చాలా భాషలు వచ్చు. కాన్వెంటులో చదవడం వల్ల సరళమైన ఇంగ్లీషు మాట్లాడేవారు. ఎలాంటి భేషజాలను ప్రదర్శించేవారు కాదు. షూటింగ్‌లో ఏమాత్రం ఖాళీ దొరికినా పుస్తకంలో తల దూర్చేవారు. ఆ పుస్తకం అయిపోయిన తరువాత దాని గురించి మాట్లాడితే ఫలానా పేజీలో, ఫలానా పేరాలో అంటూ పూసగుచ్చినట్లు చెప్పేవారు. అంతగొప్ప జ్ఞాపకశక్తి ఆమెది. అప్పట్లో చెన్నైలోకి ఏ ఆంగ్ల పుస్తకం వచ్చినా మొదట ఆమె వద్దకు చేరేదనేవారు. పుస్తక పఠనం వల్లనే ఆమెకు ఎదుటివారిని అంచనా వేయగలిగే గుణం అలవడిందనుకుంటా.

### తక్కువ మేకప్ ...

సహజంగానే జయ తెల్లగా, అందంగా వుండేవారు కదా! అందుకే ఆమె మేకప్ తక్కువగా వేసుకునేవారు. టచప్ మాత్రం చేసుకునేవారు. కొంతమంది తెల్లగా వున్నా వుల్లుగా మేకప్ వేసుకుంటారు. కానీ ఆమె మాత్రం తక్కువ మేకప్‌తోనే కెమెరా ముందుకు వచ్చేవారు.

### ఆమె చేతుల మీదుగా రెండు అవార్డులు ...

జయ చేతుల మీదుగా నేను రెండుసార్లు సత్కారం పొందడం సంతోషకరమైన విషయం. ఒకసారి 'అన్నాదురై' పేరుతో నాకు అవార్డు ఇచ్చారు. ఎప్పుడో ఏర్పడిన పరిచయాన్ని గుర్తుపెట్టుకుని, నా గురించి ఆరా తీసి ఆ అవార్డును నాకు ఇచ్చారు. ఆ వేదిక మీదకు నవ్వుతూ నన్ను ఆవిడే ప్రత్యేకంగా ఆహ్వానించారు. వేదికపై అవార్డు ఇచ్చేటప్పుడు 'నేను గుర్తున్నానా?' అని అడిగాను. 'మిమ్మల్ని ఎలా మరచిపోతాను?' అని చిరునవ్వులు చిందించారు. మరోసారి దక్షిణాది సినీ పరిశ్రమ శతవసంతాల పండగకు కూడా హైదరాబాద్‌లో వున్న నన్ను ప్రత్యేకంగా పిలిపించారు. అప్పుడు కూడా 'బావున్నారా?' అంటూ నవ్వుతూ ఆప్యాయంగా పలుకరించారు. ఎవరైనా తన మనసుకు నచ్చితే అంత త్వరగా మరచిపోయే రకం కాదామె. అంతగా చేరదీస్తారు. ఒకవేళ నచ్చకపోతే దరిదాపులకు కూడా రానీయరని విన్నాను.




### సాదాసీదాగా ఎదగలేదు...

రాజకీయాల్లో కూడా జయ సాదాసీదాగా ఎదగలేదు. లోకం పట్ల ఆమెకున్న జ్ఞానం, ప్రజల్లో ఆమెకున్న అభిమానం ఆమెను ఆ స్థాయికి తీసుకొచ్చాయి. ఆమె మరణం తరువాత కూడా గ్రామాలు, పట్టణాలు 'అమ్మ.. అమ్మ' అంటూ ఎంతగా అల్లాడిపోతున్నాయి. పేదలు అంతగా బాధ పడుతున్నారంటే సామాన్యమైన విషయమా? ఆమె ఎదిగిన తీరును చూసి ఒక మహిళగా నేను గర్విస్తున్నా. అది నుంచీ ఆమెది ఒంటరి పోరాటమే. ప్రత్యర్థులతో ఎలా పోరాడారు? పార్టీని, ప్రభుత్వాన్ని ఎలా లాక్కొచ్చారు? రాటుదేలిన ప్రత్యర్థుల మధ్య ఆమె నెగ్గుకొచ్చిన తీరు ఒక రాజకీయ నాయకురాలిగా ఆలోచిస్తే నా మతి పోతుంది. ఆమె నిజంగా 'ఐరన్ లేడీ' (ఉక్కు మహిళ). మహా మొండి మనిషి. అయితే ఆ మొండితనమే ఆమెకు ప్లస్ అయినట్లుంది. అన్ని పార్టీల్లో గ్రూపులు, నెంబర్ టూ నేతలున్నారు. కానీ జయ పార్టీలో ఆమె మాటకు రెండో ఆలోచన వుందా? ఆమె పేరులో జయం, లాలిత్యం వున్నట్లుగానే ఆమె రాజకీయాల్లో ఝాన్సీరాణి- ప్రజల హృదయాల్లో మదర్ థెరిసా. వారిద్దరి కలబోత జయలలిత.

**- డాక్టర్ ఎస్కేఎండీ గౌస్‌బాషా,** ఆంధ్రజ్యోతి, చెన్నై

# ఆ పాటంటే ఆమెకు మక్కువ


నిర్మాత మురారి

జయ జ్ఞాపకాల తోటలో..

నేను అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్న రోజులవి. 'ప్రేమలు పెళ్లిళ్లు' (1974) షూటింగ్ జరుగుతోంది. అక్కినేని నాగేశ్వరరావు, జయలలిత, శారద హీరోహీరోయిన్లు. ఆ సినిమాకి నేను అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేశాను. మొదటి రోజు షూటింగ్. ఎస్వీ రంగారావుతో జరుగుతున్న చిన్న సంభాషణలో 'జకార్తా ఫిలిం ఫెస్టివల్‌లో వచ్చిన ప్రత్యేక అవార్డు (అప్పటికే ఎస్వీఆర్‌కు ఆ అవార్డు వచ్చింది) ఆస్కార్ అవార్డు కంటే గొప్పది కాదు కదా' అని నేను అంటే ఆయనకు కోపం వచ్చింది. అటువంటి మహానటుడితో వాదించడం అన్నది ఒక అసిస్టెంట్ డైరెక్టర్ స్థాయికి మించిన తాహతు. దాంతో అక్కినేని, దర్శకుడు వి.మధుసూదనరావు ఆ వాదనని తేలికపరుస్తూ ముగించారు. ఆ తర్వాత నేను చేతిలో ఫైలు పట్టుకుని వెళ్లిపోతుంటే అక్కడే కూర్చున్న జయలలిత నన్ను పిలిచారు. సీను వివరాలు చెప్పమంటూనే "ఏమిటి? ఆస్కార్ అవార్డు గురించి ఏదో మాట్లాడుతున్నారు?" అనడిగారు. "అవునండీ... స్పెన్సర్ ట్రేసీ, గ్రెగరీ పెక్‌లాంటి గొప్పగొప్పోళ్లకి ఆస్కార్ అవార్డు వచ్చింది. రంగారావుగారికి ఏదో జకార్తా అవార్డు అంటారు. ఆస్కార్ కంటే గొప్పదంటున్నారు" అని నేను ఏదో అనబోతుంటే ఆవిడ నవ్వి "మీ దృష్టిలో ఆస్కార్ అవార్డు రాకపోతే వాళ్లు నటులు కారా?" అన్నారు. ఎస్వీఆర్‌ని సమర్థిస్తూ 'అప్పటికి దక్షిణాది సినిమాలను ఆస్కార్ అవార్డులకు పంపించేంత సీన్ లేద'న్నారు.

### అదీ జయలలిత అంటే ...!

ఒకసారి మాటల సందర్భంలో 'డాక్టర్ జివాగో' ఆంగ్ల చిత్రంలో నటించిన ఒమర్ షరీఫ్‌కి ఉత్తమ నటుడిగా అవార్డు వస్తుందనుకుంటే ఆయనకు రాలేదు. కానీ, 'దో ఆంకే బారాత్' హిందీ సినిమాకి కేన్స్ ఫిలిం ఫెస్టివల్‌లో అవార్డు వచ్చింది కదా. జోరుగా కురుస్తున్న వానకి గదిలోని కిటికీ టపటపా కొట్టుకుంటుంటే స్వరపరచిన నేపథ్య సంగీతానికే ఆ అవార్డు వచ్చింది అన్నాను. ఆ సన్నివేశంలో వచ్చే 'ఏ మాలిక్ తేరే బందే హమ్..' పాటని మొదట లతా మంగేష్కర్ పాడారు. సినిమా ముగింపులో గాయకుడు మన్నాడే ఇతర గాయకులతో కలిసి పాడారు. ఆ పాటే ఆ సినిమాని నిలిపింది. ఆ సినిమాలో పాటలు, నేపథ్య సంగీతానికే కేన్స్ అవార్డు వచ్చిందని నేనంటే ఆవిడ నవ్వింది. "అంత ఇష్టమా ఆ పాటంటే మీకు" అంది. కేవలం ఆ పాట కోసమే 15, 20 సార్లు సినిమా చూశానని చెప్పాను. ఆవిడ మళ్లీ నవ్వి "ఆ పాటకి అర్థం తెలుసా మీకు?" అనడిగింది. 'నీ బందీలం మేము' అంటూ భగవంతుడ్ని ప్రార్థిస్తూ ఆర్ద్రతతో కూడిన ఆర్తనాదమే కదా అని చెబుతుంటే... 'షాట్ రెడీ' అని వినబడడంతో ఆ సంభాషణ అక్కడితో ఆగిపోయింది. అప్పుడు ఆవిడ కుర్చీలో కూర్చుని టచప్ చేసుకుంటున్నారు. జయలలిత ఒక అసిస్టెంట్ డైరెక్టర్‌తో అంతసేపు మాట్లాడుతుండడం, పైగా అది వేరే సినిమాల గురించి, పాటల గురించి మాట్లాడుతున్నా ఆమెని డిస్టర్బ్ చేసే ధైర్యం ఎవరికీ లేదు. కొన్నేళ్ల క్రితం సిమి గరేవాల్ చేసిన ఇంటర్వ్యూలో... జయలలిత తనకు ఇష్టమైన పాటల్లో ' ఏ మాలిక్ తేరే బందే హమ్' పాట గురించి కూడా చెప్పారు. అది వినగానే నాకు ఆశ్చర్యంతోపాటు ఆనందం కలిగింది. ఆమె మరణానంతరం సిమి గరేవాల్ ఇంటర్వ్యూ మళ్లీ వేశారు. అది చూసి నా కళ్లు చెమర్చాయి. ఆ కన్నీటి వెనుక జ్ఞాపకాల తెరలు తెరచుకున్నాయి. మనసంతా బరువైంది.

### మనిషిని మనిషిగా గౌరవించేవారు...

జయలలిత సెట్‌లో అందర్నీ ఒకేలా చూసేవారు. నిర్మాతలు, దర్శకులు, సహ నటీనటులు, లైట్ బాయ్స్ అందర్నీ గౌరవించేవారు. కానీ ఎవరితో ఎలా ఉండాలో, ఎవర్ని ఎక్కడ ఉంచాలో ఆమెకి బాగా తెలుసు. అసిస్టెంట్ డైరెక్టర్‌గా నేను ప్రతిరోజు డైలాగులు చెప్పడానికి ఆవిడ ఉండే హోటల్‌కి వెళ్లేవాడ్ని. మరుసటి రోజు చేయబోయే సీను, సంభాషణలు చెప్పడం సహాయ దర్శకుల పని. నాకంటే సీనియర్ ఉన్నా ఆ పనిని కావాలని నేనే నా చేతుల్లోకి తీసుకుని వెళ్లి చెప్పేవాడిని. నాకు అదో సరదా. అది ఆవిడకి అర్థమైంది. సాధారణంగా ఒక అసిస్టెంట్ డైరెక్టర్ వచ్చినప్పుడు చాలామంది హీరోయిన్లు ఆమడ దూరాన ఉంచి ఒక పనివాడిని చూసినట్టు చూసేవారు. ఆవిడ మాత్రం అలా ఎప్పుడూ చూడలేదు. 'ప్రేమలు పెళ్లిళ్లు' సినిమాలో ఆమె పాత్ర గురించి మాట్లాడుతూ 'డాఫ్నె డు మారియర్ రాసిన 'రెబెకా'లోని మిస్ట్రెడ్‌లాంటి పాత్రలాంటిదే మీ పాత్ర. ఆ నవలలోని పాత్రలాగా మీ పాత్రని తీర్చిదిద్దితే ఈ సినిమా నాలుగు రోజులు కూడా ఆడద'ని అంటే ఆవిడ పగలబడి నవ్వింది.

### సూర్యకాంతంతో అనుబంధం ...

సూర్యకాంతం మరణించినప్పుడు (అప్పటికే పరిశ్రమ హైదరాబాద్‌కి వెళ్లిపోయింది) మద్రాసులో ఉన్నవారితో సహా హైదరాబాద్‌లో ఉన్న నటీనటులు, నిర్మాతలు ఎవరూ ఆవిడ పార్థివదేహానికి అంజలి ఘటించడానికి రాలేదు. సూర్యకాంతంగారితో నాకు పరిచయం లేదు. అయినా ఒక నిర్మాతగా అక్కడికి వెళ్లేసరికి వరండాలో ముఖ్యమంత్రి జయలలిత కూర్చుని వున్నారు. అదే ఆవిడలోని గొప్పతనం. అక్కడికి ఆమె నటిగానో లేక ముఖ్యమంత్రిగానో కాకుండా, ఒక బిడ్డలా వచ్చిందనిపించింది. ఆమె సూర్యకాంతం చేతివంట ఎంతో ఇష్టంగా తినేవారట. నేను నిర్మాతగా మారిన తర్వాత ఆవిడ ఇంట్లో (పోయెస్ గార్డెన్) శోభన్‌బాబు నటించిన 'గోరింటాకు' షూటింగ్ చేస్తున్నప్పుడు నన్ను ఎంతో ఆప్యాయంగా చూశారామె. ఆ ఇంట్లో దాదాపు 15 రోజులు షూటింగ్ చేశాం. సినిమా పూర్తయిన తరువాత ఐబీఎం థియేటర్‌లో ఆవిడకి ప్రత్యేకంగా షో కూడా వేశాను. నేను అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్నప్పుడు చూసిన జయలలిత తెలివైన అమాయకపు ఆడపిల్లలా కనిపించేది. కానీ ఆ తర్వాత జయ రాజకీయాల్లో రాటుదేలి, అందరికీ 'అమ్మ'గా మారడం మర్చిపోలేని చరిత్ర.

**- గనిరెడ్డి అరుణ్‌కుమార్,** ఆంధ్రజ్యోతి, చెన్నై

# అందరికీ 'అమ్మ' నాకు మాత్రం 'అమ్ము'



నటి గీతాంజలి

అందరికీ ఆమె అమ్మ. నాకు అమ్ము. వాళ్ల అమ్మ సంధ్యగారు జయని "అమ్మూ.." అని పిలవడం తరచూ వినీ వినీ నాకూ అదే అలవాటైపోయింది. అమ్ముతో నా పరిచయం యాభై ఏళ్ల క్రితం నాటిది. నేను, మా అక్క, అమ్ము .. ముగ్గురం ఒకే దగ్గర భరత నాట్యం నేర్చుకునేవాళ్లం. సరదాగా నడుస్తూ, బోల్డన్ని కబుర్లు చెప్పుకుంటూ అభిరామపురం నుండి ఆల్వార్ పేట దాకా డాన్స్ టీచర్ సరసగారి ఇంటికి వెళ్లడం ఇప్పటికీ బాగా గుర్తుంది. ఆ తర్వాత కొంత కాలానికి ఎన్.టి.రామారావుగారు నన్ను 'సీతారామకళ్యాణం'లో 'సీత' పాత్రతో పరిచయం చేసి నాకొక జీవితాన్నివ్వడం మీకు తెలిసిందే. అమ్ము కూడా ఆ తర్వాత సినిమాల్లోకి వచ్చింది. మధ్యలో చాలా గ్యాప్ వచ్చింది. మళ్లీ దాదాపు 8 ఏళ్ల తర్వాత 'గూఢచారి 116' సినిమాలో నటిస్తున్నప్పుడు కలుసుకున్నాం. నన్ను చూడగానే 'గీతా' అంటూ ఆలింగనం చేసుకుంది అమ్ము. మా చిన్ననాటి సంగతులన్నీ మరొకసారి నెమరువేసుకున్నాం.

●●●

'ఆదర్శకుటుంబం'లో నేను అమ్ము తోటికోడళ్లుగా నటించాం. అందులో ఒక హరికథ సీన్ ఉంది. ఆ సన్నివేశం తీసినంతసేపూ మేమిద్దరం పక్కపక్కనే కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండేవాళ్లం.



'ఆదర్శకుటుంబం'లో...

షూటింగ్‌లో ఏమాత్రం విరామం దొరికినా 'రా గీత కబుర్లు చెప్పుకుందాం' అని పిలిచేది. తెలుగులో ఇద్దరం కలిసి చాలా సినిమాలే చేసినా తమిళంలో ఎం.జి.ఆర్.గారికి అమ్ము జంటగా నటించిన దాదాపు 20 చిత్రాల్లోనూ నేను నటించాను. తమిళంలో 'ఎన్ అన్నన్' (తెలుగులో 'పూలరంగడు') చిత్రం షూటింగ్ జరిగినన్ని రోజులూ ఎం.జి.ఆర్. గారు, నేను, అమ్ము ఒకేదగ్గర కూర్చుని కబుర్లు చెప్పుకునేవాళ్లం. అమ్ము 'సుఖ దుఃఖాలు' చిత్రంలో మా వారు రామకృష్ణగారికి జంటగా నటించింది. మాకు బాబు పుట్టాడని తెలిసి ఒకరోజు హఠాత్తుగా మా ఇంటికి వచ్చేసింది. నా నోట మాట రాలేదు. అప్పటికే అమ్ము నెంబర్‌వన్ హీరోయిన్. మా బాబుని ఆశీర్వదించి తను తెచ్చిన గిఫ్ట్ వాడి చేతిలో ఉంచి వెళ్లడం ఒక మధురమైన గుర్తు. ఆ తర్వాత బాబు ఫస్ట్ బర్త్‌డే జరిపినప్పుడు కూడా పిలిచాను. అమ్ము చాలా బిజీగా ఉండేది. రాదనుకున్నాను. కాని గుర్తుపెట్టుకుని వాళ్ల పిన్ని విద్యావతిగారితో కలిసి వచ్చి బాబుని ఆశీర్వదించి వెళ్లింది.

●●●

అమ్ము తొలిసారి ముఖ్యమంత్రి అయినప్పుడు నేను రామకృష్ణగారు ఎంతో సంతోషపడ్డాం. అమ్ము టీవీలో కనిపించినప్పుడల్లా మావారు "రారా .. మీ ఫ్రెండ్ వచ్చింది" అని కేకేసేవారు. అమ్ముని ముఖ్యమంత్రి హోదాలో చూసినప్పుడల్లా గర్వంగా అనిపించేది. అంతలోనే దిగులేసేది. ఇప్పుడు అమ్ముని కలవడం కష్టం కదా అనిపించి. ఒకసారి ఒక ఫంక్షన్‌కి మా దంపతులకు ఆహ్వానం వచ్చింది. ఆ ఫంక్షన్‌కి ముఖ్యమంత్రిగారు వస్తున్నారనే విషయం కూడా చెప్పారు. దూరం నుంచయినా అమ్ముని చూసే అదృష్టం కలగబోతుంది కదా అని చాలా సంతోషపడ్డాను. మేము వెళ్లే సరికే ఆడిటోరియం వెనకవైపు మురళీమోహన్, జయచిత్రగార్లు కూర్చుని ఉన్నారు. ఆ ఫంక్షన్‌కి అప్పటి కేంద్రమంత్రి జనార్దన్‌రెడ్డిగారు కూడా వస్తారని తెలిసింది. ఆయనకంటే ముందే అమ్ము వచ్చేసింది. అంతకు ముందు నేను చూసిన అమ్ముకు ముఖ్యమంత్రిగా చూస్తున్న అమ్ముకు అసలు పోలికే లేదు. వెనక పోలీసు ఆఫీసర్లు, రాజకీయనాయకులు .. మంది మార్బలంతో ఒక శక్తిలా కనిపించింది. నన్ను గుర్తు పడుతుందో లేదో అని మనసు పీకుతూనే ఉంది. అంతమందిలో కూడా నన్ను చూడగానే 'గీతా' అని గట్టిగా పిలిచింది. అక్కడున్న వారంతా అవాక్కయ్యారు. ప్రేమగా నన్ను దగ్గరకు తీసుకుని మా పక్కనే కూర్చుని 'బాబు బాగున్నాడా' అని గుర్తుపెట్టుకుని మరీ అడిగింది. ఫంక్షన్ మొదలయ్యే వరకు అరగంటసేపు కబుర్లు చెప్పుకున్నాం. మా ఇద్దరికీ తమిళం వచ్చినా ఇద్దరం తెలుగులోనే మాట్లాడుకునేవాళ్లం.

●●●

రామకృష్ణగారు చనిపోయినప్పుడు ముఖ్యమంత్రి కార్యాలయం నుండి గుర్తుపెట్టుకుని నాకు 'కండోలెన్స్' పంపించడం మర్చిపోలేను. ఇంకోసారి దాసరి పద్మగారితో పాటు మరో ఫంక్షన్లో అమ్ముని కలిసినప్పుడు నన్ను చూడగానే "గీతా .. రామకృష్ణ లేడని బాధపడకు. నేనున్నాను. నీకు ఏ కష్టం వచ్చినా నాతో చెప్పు .. " అన్నారు.

అమ్ము వ్యక్తిత్వం కోటిమందిలో ఏ ఒక్కరికో ఉంటుంది. అంత డిగ్నిటీగా, డీసెంటుగా ఉండే స్త్రీని నేనిప్పటివరకూ చూడలేదు. ఆ డిగ్నిటీ కొందరికి గర్వంలా అనిపించేది కాని అది ఆమె తత్వం. ఆమె కొందరికి శక్తి స్వరూపిని. నాకు ప్రేమామృతాన్ని పంచే అమృత భాండాగారం. అమ్ము నా నెచ్చెలి కావడం నా పూర్వజన్మ సుకృతం.

- గొరుసు



# నా ఇష్టం




మనం జిహాద్‌లో పాల్గొనకుండానే చలికే
పోతామేమోనని ఆందోళనగా ఉంది
సులేమాన్ !!


బాగా చిల్లరతో
బలిసినోడులాకే !!


టీ, టిఫిన్స్ పెట్టి ఇబ్బంది పెడితే
పని మానేస్తానమ్మా
మీకు బాగా చేయటం
వచ్చాక తింటా !


STOP
చలెక్కువగా ఉంది
కాస్త దగ్గరగా జరగొచ్చాండీ ?








# వెయ్యావుల కుటుంబం!

**ఇంట్లో రెండు పశువులున్నా ఆ ఇల్లు ఎంతో శోభాయమానంగా ఉంటుందని పెద్దలంటారు. కాని పశువులకు సరిపడా మేత దొరకక, మేపేవాళ్లు దొరకక, ఒక సంవత్సరం కరువు వస్తే కూడా తట్టుకోలేని పరిస్థితిలో రైతులు కాడెద్లను, పాలిచ్చే ఆవులను సైతం కబేళాలకు పంపిస్తున్నారు. ఈ పరిస్థితుల్లో కూడా తాతల కాలం నుంచి పశువులను వారసత్వంగా తీసుకుని వాటినే జీవనాధారంగా చేసుకుని పశుసంపదను పెంచుతున్న ఒక కుటుంబం ఉంది. వెయ్యి ఆవులను సాకుతున్న ఆ కుటుంబం విశేషాలే ఇవి...**

వనపర్తి జిల్లాలోని పెబ్బేరు మండల కేంద్రానికి చెందిన రామయ్య ఒక పశువుల వ్యాపారి. నిత్యం వాటిని అమ్మడం, కొనడం, కబేళాలకు తరలించడం చేసేవాడు. కొంతకాలం వ్యాపారం బాగానే సాగింది. అయితే కబేళాలకు వెళ్తున్న కాడెద్లు, ఆవులు తనవైపు జాలిగా చూసే చూపులు ఆయనను నిద్రపోనివ్వలేదు. పశుసంపదను పెంచాలే కానీ తుంచకూడదనిపించింది. ఆ రోజు నుంచి పశువులను కబేళాలకు అమ్మడం మానేసి, పశు సంపదను పెంచుకోవడం ప్రారంభించాడు. అప్పటికి ఆయన దగ్గరున్నవి నాలుగైదు ఆవులే. వాటినే వృద్ధిచేశాడు. ‘ తన తరువాత కూడా పశుసంపదనే జీవనాధారంగా చేసుకుని బతకమ’ని కొడుకు కృష్ణయ్యకు హితబోధ చేశాడు.

**అప్పుడు నాలుగైదు ... ఇప్పుడు 1000 ...**

తండ్రి సలహా ప్రకారం కృష్ణయ్య ఆవుల పెంపకం మీదే దృష్టిపెట్టాడు. క్రమక్రమంగా ఆవుల సంఖ్యను పెంచాడు. తన కొడుకు రాములుకు కూడా తండ్రి చెప్పిన విషయాన్నే చెప్పాడు. రాములు తన ఇద్దరు కొడుకులైన చందు, రాజులకూ అదే విషయం చెప్పాడు. తమ తాత తండ్రిలాగా వారిద్దరు కూడా చిన్నప్పటి నుంచే పశుపోషణలో



తండ్రికి చేదోడు వాదోడుగా ఉండేవారు. తాత మాటలు మనవళ్లకు తెలియకపోయినా పశుపోషణనే వారు తమ వంశాచారంగా మార్చుకున్నారు. ఇలా మూడు తరాల వారు పశుపోషణే జీవనాధారంగా బతకడమేగాక ఈ అన్నదమ్ముల పిల్లలు కూడా ఇదేపనిలో కొనసాగడం విశేషం. ప్రస్తుతం వారి దగ్గర 1000 ఆవులున్నాయి. “ఇన్ని ఆవులను సాకడానికి ఇబ్బంది కావడం లేదా?” అని అడిగితే “ ఇబ్బందేముంది? మేం వాటిని సాకుతున్నాం... అవి మమ్మల్ని సాకుతున్నాయి. మా తర్వాత తరాలు కూడా వీటిపైనే ఆధారపడతాయి. ఒకరకంగా మా వంశంలో (తాము యాదవులం కాదని అరె బుడిబుడికల కులానికి చెందినవాళ్లమని చెప్పారు) ఆస్తుల పంపకం పశువుల రూపంలోనే ఉంటోంది” అని చెప్పారు వాళ్లు. తండ్రి వారసత్వంగా ఇచ్చిన 1000 ఆవులను చెరో 500 చొప్పున పంచుకున్నారు. పంచుకున్న అన్నింటినీ ఒకేచోట ఉంచి సాకుతుంటారు. మొత్తం ఈ అన్నదమ్ముల కుటుంబంలో చిన్నా, పెద్ద కలిపి 20 మంది దాకా ఉంటారు. అందరిదీ అదే పని.



### ఆవుల పెంపకం మాత్రమే ...

సాధారణంగా గేదెల్లో అయితే ఆడదూడలు పుడితే పెంచుకుంటారు. మొగవైతే కాస్త పెరగగానే కబేళాలకు అమ్మేస్తారు. వీళ్లు ఆవుల మీదే బతుకుతున్నారు కాబట్టి పెయ్య దూడల్ని ఉంచుకుని ఒక వయస్సు వచ్చిన కోడె దూడల్ని అమ్మేస్తారు. అందువల్ల వాళ్ల మందలో ఎప్పుడైనా సరే ఎక్కువ ఆవులే ఉంటాయి. పునరుత్పత్తి కోసమని కొన్ని ఎద్దుల్ని మాత్రం ఉంచుకుంటారు.

కోడె దూడలను రైతులు వ్యవసాయం కోసం కొంటారు కాబట్టి అవి ఎంత బలిష్టంగా ఉంటే అంత ధర పలుకుతాయి. కోడె దూడలు బలిష్టంగా ఉండాలన్న ఉద్దేశంతో వీళ్లు ఆవులకు పాలు పిండరు. మొత్తం దూడలకే వదిలేస్తారు. దాంతో అవి రెండేళ్లలో బలిష్టంగా తయారవుతాయి. వాటికి మంచి డిమాండ్ ఉండటంతో ఒక్కో జత కోడె దూడలను రూ. 25 వేల నుంచి రూ. 30 వేలకు విక్రయిస్తారు. అలా యేడాదికి పది నుంచి పదిహేను జతల వరకు విక్రయిస్తారు. ఎన్ని రకాల ట్రాక్టర్లు వచ్చినా వ్యవసాయానికి ఎద్దుల అవసరమూ ఉంటుంది కాబట్టి కోడెదూడలకు డిమాండ్ ఎప్పుడూ ఎక్కువే.

### ఒక్క ఎకరం లేకున్నా ధీమాగా పెంపకం

సొంతంగా ఒక్క ఎకరా భూమి లేకున్నా వారు వెయ్యి పశువులను పోషిస్తోంచడం మరో విశేషం. వర్షాకాలంలో గుట్టల్లో పచ్చగడ్డి దొరుకు తుంది కాబట్టి ఆరునెలల పాటు ఉదయం 7 గంటల నుంచి సాయంత్రం 6గంటల వరకు అక్కడికి మేతకు తీసుకెళ్తారు. "పొద్దున్నే సద్ది కట్టుకుని పశువులను మేతకు తోలుకెళ్తాం. మళ్లీ సాయంత్రం ఐదారు గంటలకు తిరిగొస్తాం. పదేళ్ల లోపు పిల్లలు పశువుల పాక దగ్గరనే చిన్న లేగదూడలకు కాపలాగా ఉంటారు. వాళ్లకు పశు పెంపకమే పెద్ద చదువు" అని రాజు చెప్పాడు. మిగతా ఆరు నెలలు ఖరీఫ్ పంట చేతికొచ్చిన తర్వాత జూరాల ఆయకట్టు కింద ఉన్న పొలాల్లో మేతకు తీసుకెళ్తారు. ఆ పొలాల రైతులు కూడా అభ్యంతరం వ్యక్తం చేయరు. ఎందుకంటే ఒక్కొక్కరి పొలంలో పశువులు రెండు, మూడు రోజులు ఉండటం వల్ల వేరే ఎరువు అవసరం లేకుండా పొలానికి సత్తువ వచ్చేస్తుంది కాబట్టి. పేడ మంచి సేంద్రియ ఎరువు కదా

#### పశువులు మా ప్రాణం...



నేను చిన్నప్పటి నుంచి ఈ పశువుల మధ్యనే పెరిగాను. పశువులంటే మాకు ప్రాణం. మా తాతల కాలం నాటి నుంచే పశుపోషణ మాకు వారసత్వంగా వచ్చింది. ఆవులను మేపడంతోనే రోజంతా గడిచిపోతుంది. చిన్నచిన్న లేగలతో ఆడుకున్నప్పుడు చాలా సంతృప్తిగా ఉంటుంది. బడి, గుడి, ఇల్లు అన్నీ మాకు పశువులే.

**- రోజా**, రామయ్య మనవరాలు

ఎంతటి కరువు వచ్చినా, పశువులు ముసలివైపోయినా ఒక్క ఆవును కూడా విక్రయించరు. వాటికి జబ్బు చేస్తే అన్నీ తామై చూసుకుంటారు. "ఇన్నేళ్లు సాకిన అనుభవంతోనే వాటికి కావాల్సిన మందులు తెచ్చి వేస్తాం. అవసరమైతే పశువుల డాక్టర్ దగ్గరకు తీసుకెళ్తాం. ఆవులన్నిటినీ మా కుటుంబసభ్యుల్లాగే చూస్తాం. మా పిల్లలు వాటికి పేర్లు కూడా (30 నుంచి 50 ఆవులకు) పెట్టుకుని పిలుచుకుంటారు" అని రాజు చెప్పాడు.



కోడె దూడల విక్రయంతో పాటు యేడాదిలో ఆరు నెలల పాటు (మిగతా ఆరునెలలు పొలాల్లో మేసినందుకు పేడను అక్కడే వదిలేస్తారు) నెలకు 30 నుంచి 40 ట్రాలీల చొప్పున పేడను విక్రయిస్తారు. ఒక్కో ట్రాలీకి సుమారుగా రూ. 1600 చొప్పున ఆదాయం వస్తుంది. ఈ ఆదాయమే వారి కుటుంబానికి ఆధారం. 'చదువుకుంటే బాగుంటుంది కదా' అంటే ' చదువుకున్న వారెంతోమంది వ్యవసాయం చేస్తున్నారు. చాలామంది ఖాళీగా కూడా తిరుగుతున్నారు. మా కోసమే మేం కష్టపడుతున్నాం కాబట్టి అందరం ఇష్టంగానే ఈ పని చేస్తున్నాం" అంటారు ఈ పిల్లలంతా. ఈ మధ్య గొర్రెల పెంపకందారులు, ఇతరులు పోటీకి వస్తుండటంతో పశువులకు మేత దొరకడం, అవి ఉండటానికి చోటు దొరకడం కూడా కష్టంగా మారుతోందని, దాని వల్ల మేత కోసం మరింత దూరం వెళ్లక తప్పడం లేదని చెప్పారు. ప్రభుత్వ సాయాన్ని ఏ మాత్రం ఆశించకుండా, ఎన్ని కష్టనష్టాలెదురైనా తాతల వారసత్వాన్ని నిలబెడుతూ ఆవుల పెంపకాన్ని కొనసాగిస్తున్న 'రామయ్య కుటుంబం' ఎంతైనా అభినందనీయులు.

**- నోముల రవీందర్‌రెడ్డి**, వనపర్తి



ఏ పదాన్ని ఎప్పుడు, ఎక్కడ, ఎలా వాడాలో... అప్పుడు, అక్కడ, అలా ఒడుపుగా వాడటంలో దిట్ట కులశేఖర్. విశ్వనాథ సత్యనారాయణ సాహిత్యాన్నీ, దేవులపల్లి కృష్ణశాస్త్రి లలితగీతాలనూ ఆవాహన చేసుకున్నారు కనుకనే ఆయన కలం రెండు వైపులా పదునుతో అలా మెరిసిపోతుంది. ఆయన మరికొన్ని పాటల విశేషాలు ఇవి.



# కోయిలా.. నేర్చుకో యిలా...

సంగీతం మనిషిని ఆకట్టుకుంటుంది. సాహిత్యం ఆలోచింపజేస్తుంది. అయితే అన్ని పాటలూ ఆలోచింపజేసేవే కాకుండా కొన్ని రసోల్లాసమైన పాటలూ రాయాలంటూ వేటూరి గారు మాస్ పాటలు రాస్తున్న సమయంలో... విశ్వనాథ్ గారు నన్ను క్లాస్ పాటల వైపు మళ్లించారు. "నువ్వు జర్నలిస్టువి కాబట్టి, మాస్, క్లాస్ రెండూ రాయరా" అని సిరివెన్నెల గారు నన్ను ప్రోత్సహించారు. అయితే క్లాస్ పాటలు రాయాలంటే సాహిత్య పరిపుష్టి ఉండాలి. దానికి ప్రబంధాలు, సాహిత్య గ్రంథాలు చదవడం ద్వారా సాహిత్యంపై పట్టు పెంచుకోవచ్చు. ఆ పట్టు సాధించడానికి నేను అవలంబించిన మార్గం ఏమిటంటే... పాశురాలు వినడం. వైష్ణవ సంప్రదాయంలో ధనుర్మాసంలో 'తిరుప్పావై' పాశురాలను పాడుతుంటారు తమిళులు. ఈ పాశురాలకు తమిళ సాహిత్యంలో గొప్ప స్థానముంది. వీటిని దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తేట తెలుగులోకి అనువదించి సామాన్యులకు చేరువ చేశారు. అవి విన్నప్పుడల్లా... సాహిత్యంలో ఇలాంటి ప్రయత్నాన్ని నేను చేయలేనా? అనిపించేది. వాటి స్ఫూర్తితోనే నేను సరళమైన పదాలతో పాటలు రాయడానికి శ్రీకారం చుట్టాను.

సిరివెన్నెలగారి సూచనని దృష్టిలో పెట్టుకుని నేను మొదట్నుంచీ అటు క్లాస్ పాటలు, ఇటు మాస్ పాటలు కూడా రాయాలని సంకల్పించుకున్నాను. అదృష్టవశాత్తు నాకు కెరీర్ ప్రారంభంలోనే రెండు రకాల పాటలూ రాసే అవకాశమొచ్చింది. చిత్రం సినిమాలో 'ఊహల పల్లకిలో ఊరేగించినా... ఆశల వెల్లువై రాగం పలికించినా' అనే క్లాస్ పాటతో పాటు - 'మావోయ్.... పారిపోతున్నాది... ఎవరేంటి?...వెళ్లిపోతున్నాది... ఎవరేంటి?' అనే పాట కూడా రాశాను. ఆ రెండు పాటలూ హిట్టయాయో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

ఆ తర్వాత 'తప్పు చేసి పప్పుకూడు' సినిమా కోసం మోహన్‌బాబుగారు నన్ను పిలిపించి 'ఓ జానపద పాట ఉంది. అది నువ్వే రాయాలి' అన్నారు. సిట్యుయేషన్ అడిగాను. 'చాలామంది ఇదే ప్రశ్న అడిగి సరిగ్గా రాయలేకపోయారు. సినిమాలో కథానాయకుడు కథానాయికను నగల కోసం 'నిన్ను పెళ్లి చేసుకుంటాను' అని చెప్తాడు. కానీ ఆ అమ్మాయి అంత తేలిగ్గా నమ్మదు. ఆ సందర్భానికి తగిన పాట రాయాలి" అన్నారు. అప్పటికప్పుడే -

**అంతన్నాడు ఇంతన్నాడే గంగరాజు**
**ముంతమామిడి పండన్నాడే గంగరాజు...**

ఇలా పాట మొత్తం రాసిచ్చాను. పాట బాగా పాపులర్ అయింది. మాస్ పాటలు రాయడానికి జర్నలిజం అనుభవం కూడా ఉపయోగపడింది. మాస్‌కి ఎలాంటి పాటలు నచ్చుతాయి. అసలు వాళ్ల ఎలాంటి పదాలు వాడతారు... అనే విషయాలు పరిశీలన ద్వారా గ్రహించాను. సాధ్యమైనంత వరకూ ద్విత్వాక్షరాలు లేకుండా భావం తేలిగ్గా జనానికి చేరేట్టు ఉండాలి మాస్ పాట. అదృష్టవశాత్తూ నేను రాసిన మాస్ పాటలకు మంచి బాణీలు దొరకడంతో అవన్నీ సినిమాలను మించి హిట్టయ్యాయి.

'నువ్వు-నేను' సినిమా కోసం పాటలు రాస్తున్న సమయంలో ఓ గమ్మత్తు జరిగింది. ఆర్.పి, తేజ ట్యూన్ ఇచ్చి, మీకు రిఫరెన్స్ కూడా ఇస్తాం... అరగంటలో వస్తాం అని బయటకు వెళ్లారు. ఈలోపు నేను ట్యూన్‌కి అనుగుణంగా పాట రాసేశాను. ఆ తర్వాత వాళ్లు వచ్చి ఇళయరాజా, వేటూరి గారి కాంబినేషన్‌లో వచ్చిన పాటల స్థాయిలో ఆ పాట ఉండాలని చెబుతూ 'అన్వేషణ, ఆలాపన పాటల క్యాసెట్లు బయటకు తీశారు. అప్పటికే నేను రాసిన పాటలో 'అన్వేషణ', 'ఆలాపన' రెండు పదాలూ ఉన్నాయి!

నా పాట...34

**నీకోసమే ఈ అన్వేషణ**
**నీ ధ్యాసలో ఈ ఆలాపన**
**ఎడబాటు రేపిన విరహ వేదన... నరకయాతన**
**కాలమే దీపమై దారి చూపునా...**

ప్రియురాలిని దూరం చేస్తే ఏ ప్రియుడు అయినా ఆవేదన చెందుతాడు కదా! ఆ పరిస్థితికి తగ్గట్టే పదాలు కూడా బరువైనవి వాడాలి. అందుకే ఆ పదాలను వాడాను. ఇలాంటి పాఠాలన్నీ పాతవాళ్ల నుంచి నేర్చుకున్నవే.

పదాలతో ఆడుకున్నావురా అనిపించుకున్న పాట 'సంతోషం' సినిమాలో ఉంది. దానిలో - 'కోయిలా నేర్చుకో యిలా...' పాట.

**కోయిలా.. నేర్చుకో యిలా... ఆమె నవ్వులో తేనె సంతకం**
**హాయిగా పీల్చుకో యిలా చల్లగాలిలో ఆమె పరిమళం**

ఇలా 'కోయిలా' పదాన్ని మూడుసార్లు మూడు అర్థాల్లో ప్రయోగించాను. ట్యూన్‌కు తగ్గట్టు ప్రాస రాయడమే కాదు... ఆ ప్రాసలోనే పదాలను వినసొంపుగా, పాడుకునేందుకు అనువుగా రాయడం సాహితీకారుడికి ఉండాల్సిన లక్షణం.




మాస్, క్లాస్ పాటలే కాదు నాకు మెసేజ్ ఓరియెంటెడ్ పాటలు రాయాలన్న కోరిక కూడా బాగా ఉంటుంది.

ఒక పాట ఎవరినైనా ఆలోచింపజేస్తే, ఒకవ్యక్తిలో మంచి మార్పుకు కారణమైతే ఆ గీత రచయిత జన్మ ధన్యమైనట్టే కదా! అయితే అలాంటి పాట రాసే అవకాశం అరుదుగా వస్తుంటుంది. నాకు అలా వచ్చిన పాట 'జై' సినిమాలోని 'దేశం మనదే తేజం మనదే ఎగురుతున్న జెండా మనదే' పాట. ఈ పాట ప్రతి ఏడాదీ ఆగస్టు 15న, జనవరి 26న వినిపించడం నేను సాధించిన విజయంగా భావిస్తున్నాను. నేను రాసిన అన్ని పాటలూ నాకు సంతృప్తినిచ్చినవే. మరిన్ని పాటలు రాయడానికి నాకు స్ఫూర్తినిచ్చినవే. త్వరలో కొత్త పాటలతో మళ్లీ మీ ముందుకొస్తా... శలవ్.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## 'ఆస్టియో ఆర్థరైటిస్'కు సరైన వైద్యం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

మన శరీర ప్రతి కదలికలో 'కీళ్ళ' పాత్ర అత్యంత కీలకమైనది. అంతటి ప్రాధాన్యం సంతరించుకున్న 'కీళ్ళ' పరంగా ఏ చిన్న మార్పు ఏర్పడినా అది మన కదలికలను కష్టతరంగా మార్చి, రోజువారీ దినచర్యల నిర్వహణలో సైతం తీవ్ర ఇబ్బందులను కలుగజేస్తుంది. అలాంటి మార్పుల వలన తలెత్తే ఆస్టియో ఆర్థరైటిస్ వ్యాధి సాధారణంగా ఎక్కువ మందిలో కనిపిస్తుంది. కొందరిలో ఈ వ్యాధి వయస్సు పైబడటం వలన ఏర్పడితే, మరికొందరిలో కీళ్ళకు దెబ్బతగలటం, కొన్ని అసాధారణ కదలికలు, జీవక్రియల అసమతుల్యతలు, కీళ్ళు సంక్రమణకు గురికావడం మొ॥గు కారణాలతో పాటు కొన్ని ఇతర వ్యాధులకు గురి అయిన కారణంగా కూడా 'ఆస్టియో ఆర్థరైటిస్' ఏర్పడే అవకాశం ఉంది. కాబట్టి దీనిని యుక్తవయస్సు వారిలో కూడా ఎక్కువగా గమనించడం జరుగుతోంది. దీర్ఘకాలికంగా ఈ వ్యాధికి గురికావడం వలన, ఇది కీళ్ళను పూర్తిగా దెబ్బతీసి అంగవైకల్యానికి గురిచేసే ప్రమాదం పొంచి ఉంటుంది. ఇతర వైద్యవిధానాల మేరకు నొప్పి నివారణకు ఉపయోగించబడే మందుల వలన కేవలం తాత్కాలిక ఉపశమనం తప్పించి పూర్తిగా వ్యాధి నయం కాబడే అవకాశం లేదు. కానీ సరైన హోమియో చికిత్స ద్వారా ఏ వయస్సుల వారికైనా ఈ వ్యాధి నుండి పూర్తిగా ఉపశమనం లభించే అవకాశం ఉంది. ఆర్థరైటిస్ అనగా కీళ్ళు శోథమునకు గురికావడం. సుమారు 100 రకాలుగా కనిపించే ఈ తరహా సమస్యలలోకెల్లా 'ఆస్టియో ఆర్థరైటిస్' ప్రధానమైనది మరియు సాధారణమైనది.




**'ఆస్టియో ఆర్థరైటిస్' అనగా:-** కీళ్ళలోని కార్టిలేజ్ అనే మృదులాస్థి అరుగుదలకు గురి అయి, తద్వారా చుట్టూ ఉన్న కణజాలంపై ప్రభావం చూపడాన్ని ఆస్టియో ఆర్థరైటిస్ అంటారు. ఇది ఒక 'డీజనరేటివ్ డిసీజ్'. ఇది సాధారణంగా 40 సం॥ల వయస్సు దాటినవారిలో ఎక్కువగా కనిపిస్తుంది. పురుషులతో పోలిస్తే స్త్రీలలో, ముఖ్యంగా నెలసరి ఆగిపోయిన మహిళలలో ఎక్కువగా గమనించవచ్చు. మోకాళ్ళలో ఎక్కువగా కనిపించే ఈ సమస్య వలన - చేతివ్రేళ్ళు, వెన్నుపూస, తుంటి ప్రాంతం, కాలివ్రేళ్ళు, తదితర ప్రాంతాలు 'ఆస్టియోఆర్థరైటిస్'కు గురయ్యే అవకాశం ఉంది. సాధారణంగా కీళ్ళలోని (ఉదా: మోకాళ్ళలో) రెండు ఎముకల చివరి భాగాలు కలిసే ప్రాంతం 'కార్టిలేజ్' అనే నున్నటి మృదులాస్థితో కప్పబడి ఉంటుంది. ఈ రెండు ఎముకలు ఒకదానిపై మరొకటి తేలికగా మరియు పరస్పరం మృదువుగా కదిలేందుకు గాను ఆ ఏర్పాటు సహాయపడుతుంది. ఇంతేకాకుండా అది ఒక "షాక్ అబ్‌సార్బర్" మాదిరిగా కూడా పనిచేస్తుంది. మోకాళ్ళ అంతర్ నిర్మాణంలో భాగంగా మోకాలి జాయింట్‌ను చుడుతూ సైనోవియం అనే పొర ఉంటుంది. ఈ సైనోవియం పొర సైనోవియల్ ఫ్లూయిడ్ అనే ముఖ్య ద్రవాన్ని విడుదల చేస్తుంటుంది. ఈ సైనోవియం పొరను చుడుతూ క్యాప్సుల్ అనే మరొక గట్టి పొర ఏర్పడి ఉంటుంది. ఇది మోకాలి జాయింట్‌ను స్థిరంగా ఉంచేందుకు దోహదపడుతుంది. ఇవే కాకుండా మోచిప్ప లేదా పటెల్లా, టెండాన్స్ మరియు వివిధ లిగమెంట్లు, కండరాలతో మోకాలి జాయింట్ ఎంతో పటిష్టంగా నిర్మితమై ఉంటుంది. 'ఆస్టియో ఆర్థరైటిస్' మొదలైన కొన్ని రోజులకు కార్టిలేజ్ క్రమంగా అరిగిపోవడం ప్రారంభమవుతుంది. దీంతో అది క్రమేణా పలుచగా మారుతుంది. దీనివలన ఎముకలలో కణజాలం శోథమునకు లేదా వాపునకు గురి కావడం జరుగుతుంది మరియు ఎముకల చివరి భాగాలు అదనంగా పెరుగుతాయి. వీటిని 'ఆస్టియో ఫైట్స్' అని అంటారు. వీటి ప్రభావం చేత సైనోవియం పొర కొంచెం ఉబ్బి అదనపు ద్రవాన్ని విడుదల చేస్తుంది. దీనివలన కీళ్ళ ప్రాంతంలో వాపు ఏర్పడుతుంది మరియు ఆ రెండు ఎముకలు ఒకదానితో మరొకటి రాపిడికి గురికావడం వలన తట్టుకోలేనంత స్థాయిలో తీవ్రమైన నొప్పి ఉంటుంది.

**కారణాలు:** 40 సం॥ వయస్సు పైబడిన వారిలో - ముఖ్యంగా పురుషుల కంటే స్త్రీలలో ఎక్కువగా వస్తుంది. • పూర్వం కీళ్ళకు ఏదైనా దెబ్బ తగలడం • అధిక బరువు కలిగి ఉండటం • కాళ్ళ ఎదుగుదలలో హెచ్చుతగ్గులు ఉండటం • కీళ్ళపై అధిక ఒత్తిడి కలిగించే పనులు చేయడం • కొన్ని ఇతర వ్యాధులు (ఉదా: రుమటాయిడ్ ఆర్థరైటిస్) కలిగి ఉండటం మరియు వంశపారంపర్యత వంటి అంశాలన్నీ ఈ వ్యాధికి గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** కీళ్ళనొప్పులు, కీళ్ళవాపు, చేతితో తాకితే కీళ్ళు వేడిగా అనిపించడం • కీళ్ళు బిగువుగా మారడం, ముఖ్యంగా ఉదయాన్నే నిద్ర లేచిన తరువాత కొంత సమయం నడక కష్టంగా అనిపించడం • క్రింద కూర్చునేటప్పుడు - లేచేటప్పుడు ఇబ్బంది కలగడం • కీళ్ళ దగ్గర రాపిడి శబ్దాలు వినిపించడం • తీవ్రనొప్పి మూలంగా నడకలో వ్యత్యాసం కనిపించడం వంటి లక్షణాలను గమనించవచ్చు. • వెన్నెముక 'ఆస్టియో ఆర్థరైటిస్'కు గురి అయితే చేతులు-కాళ్ళు బలహీనపడటం, మొద్దుబారటం మరియు తిమ్మిర్లు వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** రోగి లక్షణాలను బట్టి మరియు రక్తపరీక్ష, మోకాలు నుండి కొద్దిగా ద్రవాన్ని తీసి పరీక్షించడం, X-Ray, MRI, CT-Scan వంటి పరీక్షలు నిర్వహించడం ద్వారా ఆస్టియో ఆర్థరైటిస్‌ను నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా - 'ఆస్టియో ఆర్థరైటిస్'ను తగ్గించడంలోను, కీళ్ళ కదలికలను సురక్షితంగా ఉంచడంలోనూ హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ ఎంతో కాలంగా మంచి ఫలితాలను సాధిస్తూ వస్తోంది. కేవలం నొప్పి, వాపు వంటి లక్షణాలను తగ్గించడమే కాకుండా, రోగి మానసిక-శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకొని ప్రభావవంతమైన చికిత్స ఇవ్వటం ద్వారా వ్యాధిని సంపూర్ణంగా నయం చేయవచ్చు మరియు వ్యాధి తీవ్రత పెరగకుండా కాపాడవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212 | కన్సల్టేషన్ ఉచితం 955 000 1199 | www.homeocare.in

Advt

రియల్ క్రైమ్ కహానీ - 32

# దాచాలన్నా దాగదులే...

**గాయత్రినగర్‌లో జనం పెద్దఎత్తున చేరారు. పోలీసులు వారిని కంట్రోల్ చేసేందుకు ప్రయత్నిస్తున్నారు.**

**ఈలోపు రయ్యిమంటూ దూసుకొచ్చిన పోలీసుజీపులో నుంచి పోలీసుడాగ్ స్నూపీ కిందకు దూకింది. దాని వెనుక డాగ్ హ్యాండ్లర్ మహేష్ కూడా కిందకు దూకాడు.**

**"చూడు మహేష్ ... ఇక్కడో హత్య జరిగింది. గుర్తు తెలియని వ్యక్తులు అరుణ అనే మహిళను హత్య చేసి పారిపోయారు. క్లూస్ ఏమైనా దొరుకుతాయేమో ప్రయత్నించు. గో ఎహెడ్" అంటూ స్నూపీ తల నిమిరాడు ఇన్‌స్పెక్టర్ శ్రీనివాసరావు.**

అరుణ మృతదేహం పడి ఉన్న చోటుకి స్నూపీని తీసుకువెళ్లాడు మహేశ్. కాళ్లు చేతులు కట్టేసి మెడకు కేబుల్ వైరుతో ఉరి బిగించి అరుణను హత్య చేసారు. అత్యాచారం చేసి హత్య చేసినట్లు స్పష్టమవుతోంది.

అరుణ మృతదేహం చుట్టూ తిరిగి వాసన చూసిన స్నూపీ అక్కడ ఉన్న బెడ్ పైకి జంప్ చేసింది. ఆ తర్వాత కిచెన్‌లోకి పరుగుతీసింది. సింక్ దగ్గర ఉన్న టీ కప్పులను వాసన చూసింది. అక్కడి నుంచి ఇంటి బయటకు వెళ్లి బస్టాప్ దగ్గర ఆగింది. తర్వాత తిరిగి అరుణ ఇంటి దగ్గరకు పరుగు తీసింది. తలుపుల వద్ద కొద్దిసేపు వాసన చూసి మళ్లీ పరుగు ప్రారంభించింది స్నూపీ. దాదాపు రెండు కిలోమీటర్లు పరుగెత్తి ఒక ప్రింటింగ్ ప్రెస్ వద్ద ఆగిపోయింది.

ఆ ప్రింటింగ్ ప్రెస్‌లోనే అరుణ పనిచేస్తుంది. ప్రెస్ నుంచి మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వెళ్లింది. రెండు గంటలైనా ప్రెస్‌కు తిరిగి రాకపోవడంతో ఆమెను పిలుచుకు వద్దామని ఆమె ఇంటికి వెళ్లిన సహోద్యోగి రాజు ఇంట్లో అరుణ మృతదేహాన్ని చూసి నివ్వెరపోయి పోలీసులకు ఫిర్యాదు చేసాడు.

•••

గుంటూరు జిల్లా పిడుగురాళ్ల మండలం గుత్తికొండ గ్రామానికి చెందిన అరుణ భర్త పీటర్, ఇద్దరు ఆడపిల్లలతో కలిసి చాలా సంవత్సరాల క్రితం హైదరాబాద్ కు వలస వచ్చింది. అరుణ ఒక ప్రింటింగ్ ప్రెస్‌లో పనిచేస్తుండగా, ఆమె భర్త పీటర్ ఫార్మా కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. ఆమె పెద్ద కుమార్తె బీటెక్ చదువుతుండగా, చిన్న కుమార్తె ఏడో తరగతి చదువుతోంది. చిన్న కుటుంబం... చింతలు లేని కుటుంబం. అలాంటి అరుణ మిట్టమధ్యాహ్నం తన ఇంట్లోనే హత్యకు గురైంది. హత్యకు ముందు ఆమెపై అత్యాచారం జరిగిన ఆనవాళ్లు కూడా కనిపిస్తున్నాయి.

•••

కూకట్‌పల్లి పోలీస్‌స్టేషన్‌కు వచ్చిన ఏసీపీ మల్లారెడ్డి అరుణ కేసును ఇన్‌స్పెక్టర్ శ్రీనివాసరావుతో కలిసి సమీక్షించడం ప్రారంభించారు. మిట్టమధ్యాహ్నం జరిగిన అరుణ హత్యకేసు పోలీసులకు సవాలుగా మారింది.

" శ్రీనివాస్... నీ ఫైండింగ్స్ ఏమిటి? ఈ కేసులో ఎలా ముందుకు వెళ్దాం" ప్రశ్నించారు ఏసీపీ.

" సార్... హత్య జరిగింది మధ్యాహ్నం ఒకటిన్నర నుంచి రెండున్నర గంటల మధ్యలో. అరుణ ప్రెస్ నుంచి ఒంటిగంట పదిహేను నిమిషాలకు కాలి నడకన ఇంటికి బయలుదేరింది. ప్రెస్‌కు, ఆమె ఇంటికి దూరం కేవలం రెండు కిలోమీటర్లు మాత్రమే. అంటే పది పదిహేను నిమిషాల్లో ఆమె ఇంటికి వెళ్తుంటుంది. ప్రతి రోజూ తిరిగి రెండున్నరకల్లా ప్రెస్‌కు వచ్చేది. నిన్న మూడు, మూడున్నరయినా అరుణ డ్యూటీకి రాకపోవడంతో, ఆమె చేయాల్సిన పని పెండింగ్‌లో ఉన్న నేపథ్యంలో ప్రెస్‌వాళ్లు ఆమె సహోద్యోగి రాజును అరుణ ఇంటికి పంపించారు. ఎంతసేపు పిలిచినా పలుకకపోవడంతో, తలుపులు దగ్గరగా వేసి ఉండడంతో నెట్టి లోపలికి వెళ్లి అరుణ హత్య చేయబడి ఉండడాన్ని చూసి మనకు ఫోన్ చేశాడు..."

" అరుణ భర్త పీటర్ ఏమంటున్నాడు? ఆయనకు ఎవరిపైనైనా అనుమానాలున్నాయా?"

" ఎవరి మీదా అనుమానం లేదంటున్నాడు సార్... కానీ క్రైమ్‌సీన్ చూస్తుంటే బాగా తెలిసిన వాళ్లే ఈ దారుణానికి పాల్పడినట్లు అనిపిస్తోంది. హత్యకు ముందు అరుణ మరో వ్యక్తితో కలిసి టీ తాగింది. టీ కప్పులు సింక్‌లో ఉన్నాయి. ఆ తర్వాత అరుణపై అత్యాచారం జరిగింది. తర్వాత ఆమె కాళ్లు చేతులను కేబుల్ వైర్‌తో కట్టేసి మెడకు ఉరి బిగించి చంపారు. అయితే..."

" ఏంటి నీ సందేహం..."



"నాకెందుకో ఇది అత్యాచారంలాగా అనిపించడం లేదు. అరుణ ఇష్టపూర్వకంగానే ఎవరితోనో శృంగారం నెరిపినట్టుగా సీన్ చూస్తే తెలుస్తోంది. సో... ఈ కేసులో అరుణకు బాగా తెలిసిన వ్యక్తే ఆమెతో కొద్దిసేపు గడిపిన తరువాత ఆమెను హత్యచేసాడని విషయం స్పష్టమవుతోంది. అతనెవరనేది తెలియాలి " అంటూ శ్రీనివాస్ తన విశ్లేషణను ముగించారు.

" ఓకే... అలాగైతే ప్రింటింగ్ ప్రెస్ వాళ్లని, అరుణ ఇంటి చుట్టుపక్కల వాళ్లని అందర్నీ విచారించండి. ఆమె లో దుస్తులను ఫోరెన్సిక్ పరీక్షలకు పంపించండి. కాల్ డేటా విశ్లేషణను కొనసాగించండి" అంటూ ఏసీపీ మల్లారెడ్డి సూచనలిచ్చారు.

•••

కూకట్‌పల్లి పోలీసు బృందాలు గాయత్రినగర్‌లో చక్కర్లు కొట్టడం ప్రారంభించాయి. అరుణ పనిచేస్తున్న ప్రింటింగ్ ప్రెస్ ఉద్యోగులపైనే ముందుగా వారికి అనుమానం వచ్చింది. అరుణ మృతదేహాన్ని ముందుగా చూసిన రాజుపైన పోలీసులు దృష్టి సారించారు. తమ విచారణలో రాజు, అరుణ బాగా క్లోజ్‌గా ఉండేవాళ్లని తెలిసింది.

"నువ్వే మధ్యలో ఎవరికీ తెలియకుండా వచ్చి అరుణను చంపేసి ఉంటావు. తర్వాత నాటకం ఆడుతున్నావు" అంటూ రాజును తమదైన శైలిలో విచారించారు పోలీసులు.

"నాకేం తెలియదు సార్" అని అతడు పదే పదే చెప్పాక వదిలేశారు.

ఆ ప్రెస్‌లో పనిచేస్తున్న ఇరవై నాలుగు మంది అరుణ సహోద్యోగుల రక్త నమూనాలను పోలీసులు సేకరించారు. వారిలో ఎవరైనా అరుణను చంపి ఉండవచ్చని పోలీసుల అనుమానం. అరుణ ఇంటికి వచ్చే కూరగాయలవాడు, చాకలి, పేపర్‌వాడు, కరెంట్ బిల్లు ఇచ్చేవాడ్ని కూడా పోలీసులు వదల్లేదు.

**గత ఇన్‌స్పెక్టర్ హయాంలో జరిగిన ఇన్వెస్టిగేషన్ రిపోర్టులను చంద్రకాంత్ నిశితంగా పరిశీలించారు. దాదాపు యాభై మందికి పైగా అనుమానితులను విచారించినా హంతకుడు ఎవరో తెలియలేదు. 'అంటే ప్రెస్‌లో పనిచేసి మానేసిన వాళ్లెవరన్నా అరుణను హత్య చేసి ఉండవచ్చు అనే కోణంలో విచారణ కొనసాగించాలి' అనుకుంటూ ప్రెస్‌కు వెళ్లాడు చంద్రకాంత్.**

•••

రోజుల తరబడి విచారణ కొనసాగింది. రోజులు నెలలయ్యాయి. రక్త నమూనాలు ఏవీ కూడా మ్యాచ్ కాలేదు. ఇంతలో ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ కూకట్‌పల్లి పోలీస్‌స్టేషన్ నుంచి బదిలీ అయ్యాడు. దానితో అరుణ కేసు కొన్నాళ్లు అటకెక్కింది. కొత్త ఇన్‌స్పెక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించిన ఇన్‌స్పెక్టర్ చంద్రకాంత్ అరుణ హత్య జరిగిన ఎనిమిది నెలల తర్వాత ఆ కేసును స్టడీ చేయడం ప్రారంభించారు.

గత ఇన్‌స్పెక్టర్ హయాంలో జరిగిన ఇన్వెస్టిగేషన్ రిపోర్టులను చంద్రకాంత్ నిశితంగా పరిశీలించారు. దాదాపు యాభై మందికి పైగా అనుమానితులను విచారించినా హంతకుడు ఎవరో తెలియలేదు. 'అంటే ప్రెస్‌లో పనిచేసి మానేసిన వాళ్లెవరన్నా అరుణను హత్య చేసి ఉండవచ్చు అనే కోణంలో విచారణ కొనసాగించాలి' అనుకుంటూ ప్రెస్‌కు వెళ్లాడు చంద్రకాంత్. ప్రెస్ యజమాని, ఉద్యోగులతో మాట్లాడుతూ అన్ని విషయాలను ఆరా తీయడం ప్రారంభించాడు.

•••

2012లో అరుణ హత్య జరగగా, 2010 వరకు అక్కడ పనిచేసి మానేసిన వారి వివరాలను చంద్రకాంత్ సంపాదించాడు. ఇప్పుడు వాళ్లెక్కడున్నారన్న విషయాన్ని ఆరా తీయమని క్రైమ్ కానిస్టేబుల్‌కు పురమాయించాడు. మొత్తం ఆరుగురి గురించిన వివరాలు సేకరించారు. వారికి ఈ హత్యతో సంబంధం లేదన్న విషయాన్ని నిర్ధారించుకోవడానికి చంద్రకాంత్‌కు మరో పదిరోజులు పట్టింది.

మళ్లీ ప్రెస్‌కు వెళ్లాడు చంద్రకాంత్.

" అరుణ కేసులో నా అనుమానాలన్నీ మీ ప్రెస్ చుట్టూనే తిరుగుతున్నాయి. 2010కి ముందు ఎంతమంది ఇక్కడ పనిచేసారు" అంటూ యజమానిని ప్రశ్నించాడు.

"సార్... మేం ప్రెస్ ప్రారంభించిందే 2009లో. అప్పుడే అరుణ మా దగ్గర చేరింది. ఆ అమ్మాయి అందరితో కలివిడిగా ఉండేది. ప్రెస్ స్టార్ట్ చేసిన ఏడాదిలో ఇద్దరు ఉద్యోగులు మానేసి వెళ్లిపోయారు. మిగతా వాళ్లంతా ఇక్కడే పనిచేస్తున్నారు" అంటూ వారి వివరాలను ఇన్‌స్పెక్టర్‌కు ఇచ్చాడు.

అంటే వారు ఉద్యోగం మానేసిన నాలుగేళ్ల తరువాత వారి గురించి వెరిఫై చేయడం ప్రారంభించారు పోలీసులు. ఇద్దరిలో ఒకరు రెండ్రోజుల్లోనే పోలీసులకు దొరికారు. అతను అరవై ఏళ్ల వృద్ధుడు. హత్య చేసేంత సీన్ లేదు. రెండో వ్యక్తి ప్రస్తుతం ఇక్కడ ఉండటం లేదు. నల్గొండ జిల్లాలో ఉంటున్నాడని పోలీసులు తెలుసుకున్నారు. అతని ఫోన్ నెంబర్ సంపాదించి కాల్ డీటెల్స్ వెరిఫై చేసారు.

వారి అన్వేషణకు ఫుల్‌స్టాప్ పడింది. అరుణ హత్య జరిగిన రోజున ఆ వ్యక్తి సెల్‌ఫోన్ టవర్ లొకేషన్ గాయత్రినగర్ చూపించింది. అంతే... ఒక్కసారిగా పోలీసులు అలర్టయ్యారు. మఫ్టీలో రెండు బృందాలను చౌటుప్పల్‌కు పంపించారు ఇన్‌స్పెక్టర్ చంద్రకాంత్. అయితే పోలీసుల రాకను పసిగట్టి అతను చౌటుప్పల్ నుంచి ఖమ్మం పారిపోయాడు. 'పోలీస్ కా హాథ్ బహుత్ లంబా హోతా హై' అనే మాటను నిజం చేస్తూ ఖమ్మంలో ఓ ఇంట్లో దాక్కున్న వ్యక్తిని జుట్టు పట్టుకుని ఈడ్చుకువచ్చారు పోలీసులు.

•••

కూకట్‌పల్లి పోలీస్‌స్టేషన్ విలేకర్లతో కిటకిటలాడిపోతోంది. అరుణ హత్య కేసు మిస్టరీ వీడిందని ప్రకటించారు ఇన్‌స్పెక్టర్ చంద్రకాంత్.

" హంతకుడెవరో కాదు... ప్రెస్ ప్రారంభంలో అరుణతో పాటు పనిచేసిన సహోద్యోగి రామకృష్ణ" అంటూ కేసు వివరాలను వెల్లడించడం ప్రారంభించారు చంద్రకాంత్.

" కలిసి పనిచేసే రోజుల్లో వారిద్దరి మధ్య స్నేహం బాగా పెరిగింది. ఆ క్రమంలో అరుణకి చాలాసార్లు రామకృష్ణ డబ్బులిచ్చేవాడు. తర్వాత వేరే కంపెనీలో మంచి ఆఫర్ రావడంతో రామకృష్ణ ప్రెస్‌లో పని మానేసి వెళ్లిపోయాడు. అయినా, వీరిద్దరి మధ్య స్నేహం కొనసాగుతూనే ఉంది. అరుణ మధ్యాహ్నం లంచ్‌కు ఇంటికి వచ్చిన సమయంలో అప్పుడప్పుడు రామకృష్ణ వచ్చిపోతుండేవాడు. అలాగే ఆ రోజు వచ్చిన రామకృష్ణ కొద్దిసేపు ఆమెతో గడిపిన తర్వాత తన డబ్బు విషయం ఎత్తాడు. తనకు ఇవ్వాల్సిన లక్ష రూపాయలు ఇవ్వాల్సిందిగా ఒత్తిడి చేశాడు. 'నువ్వు డబ్బు గురించి ఒత్తిడి చేస్తే నాపై అత్యాచారం చేశావని ఫిర్యాదు ఇస్తా... జైలుకు పంపిస్తా" అని అరుణ బెదిరించింది. దాంతో ఆగ్రహావేశాలకు గురైన రామకృష్ణ అక్కడే ఉన్న కేబుల్ వైరుతో అరుణ కాళ్లు చేతులు కట్టేసి ఆమెను కొట్టాడు. అయినా కసితీరక గొంతుకు ఉరిబిగించి చంపేసి పారిపోయాడు. ఆ తర్వాత ప్రెస్‌లోని తన పాత మిత్రుల ద్వారా ఇక్కడి విషయాలు ఎప్పటికప్పుడు తెలుసుకుంటుండేవాడు. అరుణ హత్యకు మూడేళ్ల ముందే అతను ప్రెస్‌లో పని మానేయడంతో అతని మీద ఎవరికీ అనుమానం రాలేదు. పాత ఉద్యోగుల పాత్రపై లోతుగా విచారించిన క్రమంలో రామకృష్ణ పట్టుబడ్డాడు" అని ఇన్‌స్పెక్టర్ చంద్రకాంత్ కేసు వివరాలను మీడియాకు వెల్లడించారు. ఇటీవలే ఈ కేసులో నిందితుడు రామకృష్ణకు జీవితఖైదు విధిస్తూ ఎల్బీనగర్ కోర్టు తీర్పు ఇచ్చింది.

**- వేముల సత్యనారాయణ, 99854 88800**

# ఉల్లిపాయలు ఇక ఏడిపించవు



‘ఉల్లి చేసే మేలు తల్లి కూడా చేయదనే’ సామెతలో నిజం ఎంతుందనే సంగతి పక్కన పెడితే ఉల్లిపాయ కోసినప్పుడు ఎంతవారైనా కన్నీళ్లు పెట్టుకోవడం ఖాయమనేది నిజం. అందుకే ఉల్లిపాయలు కోయాలంటే చిరాకుగా ఫీలవుతారు చాలామంది. ఆ చిరాకును దూరం చేసేస్తాయి ఈ ‘ఆనియన్ గూగుల్స్’ (onion googles). కూలింగ్ గ్లాసెస్‌లా కనిపించే వీటిని పెట్టుకొని ఎన్ని ఉల్లిపాయలైనా ఎటువంటి ఇబ్బంది లేకుండా చకచకా కట్ చేయవచ్చు. అన్‌బ్రేకబుల్ గ్లాసుతో తయారయిన ఈ గూగుల్స్ కిందపడినా పగిలిపోవు. ఆకర్షణీయమైన రంగులతో రూపొందించిన ఈ గ్లాసెస్ స్టైలిష్ లుక్‌తో చూడటానికి కూడా చాలా బాగుంటాయి.



## కళ్లద్దాలతో కట్టేయొచ్చు...

చిన్న పిల్లలకు చిప్స్ లేదా స్నాక్స్ ప్యాకెట్స్ ఇచ్చినప్పుడు, వాటిని మొత్తం తినేయకుండా వదిలేస్తూ ఉంటారు. ప్యాకెట్లను అలా తెరిచి వదిలేస్తే లోపలున్న పదార్థాలు గాలి చేరి మెత్తగా అయిపోవడం, లేదా దుమ్ము పడి పాడైపోవడం జరుగుతుంది. ఈ ‘సన్‌గ్లాసెస్ బ్యాగ్ క్లిప్స్’ (sunglasses bag clips) ఆ ఇబ్బందిని తొలగిస్తాయి. చూడడానికి చలువ కళ్లద్దాలలాగా అందంగా కనిపించే ఈ క్లిప్స్ స్నాక్స్ ప్యాకెట్స్‌లోకి దుమ్ము, గాలి చేరకుండా గట్టిగా కట్టేస్తాయి. ఆహారం విషయంలో పిల్లలకు మంచి అలవాట్లను నేర్పించడానికి ఈ గాడ్జెట్ బాగా ఉపయోగపడుతుంది.





ఇంటెక్

ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

## స్పూను లేకుండానే కలిపేస్తుంది..

సెల్ఫ్ స్టిర్రింగ్ మగ్ (Self Stirring Mug)లో ప్రత్యేకత ఏంటంటే స్పూను అవసరం లేకుండానే లోపలున్న ద్రవ పదార్థాలను గిరాగిరా తిప్పేసి, శుభ్రంగా కలిపేస్తుంది. స్పూను కోసం వెతుక్కోనక్కర్లేదనే కాదు చక్కెరో, కాఫీ పొడో, బూస్టో పూర్తిగా కలిసేదాకా చేత్తో తిప్పుతుండక్కరలేదు. సరిగ్గా కలవక పోయినా కష్టమే, ఈ లోపల ఆరిపోయినా కష్టమే. వెయ్యాల్సినవన్నీ వేసి బటన్ నొక్కితే చాలు అదే చక్కగా కలిపి ఇచ్చేస్తుంది ఈ సెల్ఫ్ స్టిర్రింగ్ మగ్.



## కాఫీ వేడిని తెలిపే ఫ్లాస్క్..




బయటికి వెళ్లినప్పుడు టీ లేదా కాఫీ వేడిగా ఉండాలని ఫ్లాస్క్‌ను ఉపయోగిస్తుంటాం. అయితే ఫ్లాస్క్‌ల్లో కూడా కొద్ది సమయం మాత్రమే వేడిగా ఉంటాయవి. తర్వాత మెల్లిమెల్లిగా చల్లగా అయిపోతాయి. కాఫీ వేడిగా ఉందో, లేదోనని ఫ్లాస్క్ మూత తెరిచి చూస్తే ఇంకా త్వరగా చల్లారిపోతుంది. ఈ ఇబ్బంది లేకుండా తయారుచేశారీ ‘హార్ట్ టచ్ సెన్సింగ్ కప్ విత్ టెంపరేచర్ డిస్‌ప్లే’(Heart Touch Sensing Cup With Temperature Display). ఈ ఫ్లాస్క్‌లో కాఫీ పోసి దాన్ని టచ్ చేస్తే సెన్సర్ ద్వారా లోపలున్న కాఫీ ఎంత వేడిగా ఉందో డిస్‌ప్లేలో చూపిస్తుంది. ఆ వేడిని ‘గుండె’ ఆకారంలో వెలిగే బల్బు వివిధ రంగుల ద్వారా తెలిపే సౌకర్యమూ ఉంది. ఎక్కువ వేడిగా ఉంటే ఎరుపు రంగులో, వేడి సాధారణంగా ఉంటే కాషాయం రంగులో, చల్లారిపోతుంటే నీలం రంగులో వెలుగుతుందా బల్బు.



చిన్న కథ

**పత్రికల్లో రోజూ ఎన్నో విచిత్రమైన వార్తలూ, విషాదకరమైన వార్తలూ వస్తుంటాయి. ఆ రోజు సింగిల్ కాలమ్‌లో వచ్చిన ఒక వార్తను ఎందులో చేర్చాలో నాకు అర్థం కాలేదు. అది విచిత్రంగానూ ఉంది. విషాదకరంగానూ ఉంది. ఇంతకూ వార్తేమిటో చెప్పకుండా ఏదేదో చెప్పే విలేకరి లాగా చెబుతున్నట్టున్నాను. ఆ వార్త సారాంశం ఇది.**

# సుబ్బరామయ్య మరణం

కడప జిల్లా నందలూరు అనే ఊర్లో ఉన్న సుబ్బరామయ్య అనే కవి చివరి కోరిక ఏమిటంటే... తన అంత్యక్రియల్లో తనతో పాటు తను రచించిన గ్రంథాలను కూడా దహనం చెయ్యాలన్నది. ఆ కోరికే విచిత్రంగా ఉందనుకుంటే, కవి మృతదేహంతో పాటు గ్రంథ దహనం చెయ్యడం విషాదకరంగా ఉంది. ఆ ఊరివాడే అయిన ఆ పత్రిక విలేకరికి సుబ్బరామయ్య మరణం కంటే, గ్రంథ దహనం మంచి వార్తగా కనిపించినట్టుంది. ఇది నా ఊహ కాదు. శీర్షిక అయిన 'కవి చివరి కోరిక' చివర్న ఆశ్చర్యార్థక చిహ్నాన్ని ఉంచడమూ, ఆ కవి కొడుకును కొన్ని ప్రశ్నలడగడమూ చూసి నాకలా అనిపించింది. ఆ విలేకరికి విశేష వార్తగా కనిపించినా పత్రికలో ఉన్నవాళ్ళకి అలా కనిపించినట్టు లేదు. అందుకే దానికి సింగిల్ కాలమ్ స్థానమిచ్చారు.

సరే అది మనకనవసరం. అవసరమైన విషయాన్ని అవసరమైనంత వరకే చెప్పుకుందాం. ఆ విలేకరి అడిగిందేమిటంటే, పుస్తకాలను దహనం చెయ్యడమెందుకు అని. అందుకు కవి గారి కొడుకుగారు చెప్పిన సమాధానం "అది మా నాన్నగారి కోరిక" అని. విలేకరి రెండో ప్రశ్న వాటిని కాల్చడం కంటే చదివేవాళ్ళకు ఉచితంగా ఇచ్చెయ్యవచ్చు కదా అన్నది. అందుకు సమాధానం "చదవకపోవడం కంటే తప్పు కాదు అని నాన్నగారన్నారు" అన్నది సమాధానం. ప్రధానంగా ఎవరికైనా తట్టేవీ, అడగవలసినవీ అవే కనుక, విలేకరిలో లోపమేమీ కనిపించదు. అయితే వాటికి అనుబంధ ప్రశ్నలూ, అనుబంధ సమాధానాలూ ఆలోచించేకొద్దీ చాలా కనిపిస్తున్నాయి.

"చదవకపోవడం కంటే తప్పు కాదు" అని సుబ్బరామయ్య అనడంలో, సాధారణార్థమే కాక, సంకేతార్థం కూడా ఉన్నట్టు అనిపిస్తుంది. ఇందుకు ఆ వార్తలో ఉన్న కొద్దిపాటి వివరాలు ఆధారం. సుబ్బరామయ్యగారి పుత్రరత్నం బెంగళూరులో సాఫ్ట్‌వేర్ ఉద్యోగి. ఆ తండ్రి రాసిందేమిటో తెలీకపోవడం కాదు. సాహిత్యమంటే ఏమిటో కూడా ఆ లక్ష రూపాయల ఉద్యోగికి తెలీదు. బహుశా ఆ తెలీకపోవడమే తండ్రి కోరికను నిర్వికారంగా నెరవేర్చడానికి తోడ్పడి ఉండవచ్చు. సుబ్బరామయ్యగారి సంకేతం తన వారసుడిని ఉద్దేశించే ఉండవచ్చు. దహనక్రియను జరపమనడం అందుకు శిక్షించడమూ కావచ్చు.

పుస్తకాలను చదివేవాళ్ళకు ఉచితంగా ఇవ్వవచ్చుకదా అంటే వచ్చిన సమాధానమేమిటి? చదివేవాళ్ళు లేకనే ఆ నిర్ణయం... అన్నది. అందులో "ఉచితంగా ఇస్తే మాత్రం చదువుతారన్న నమ్మకముందా?" అన్న ప్రశ్నలాంటి సమాధానమూ ఉంది. ఈవిధంగా ఆలోచించే కొద్దీ ఆ తండ్రి చెప్పిన తల్లివేరు లాంటి సమాధానాల్నించి పిల్లవేర్లలాంటి అర్థాలెన్నో పుట్టుకొస్తున్నాయి. వాటినలా ఉండనిస్తే, జరిగింది మాత్రం జాషువాగారు చెప్పినట్టు "కమ్మని కవి కలము నిప్పులలోన కరిగిపోయే". సుబ్బరామయ్య గారి కలము కమ్మనిదైనా, కాకపోయినా ఆయన కలం కమ్మని కలలే కని ఉంటుంది కదా! ఏ రకం కవిత్వమైనా కమ్మని కలలే కదా!

ఆ కమ్మని కలల్ని కట్టకట్టి కట్టెల్లో కాల్చమనడం తప్పే కదా! అదే గాదు. ఇప్పటి పరిస్థితి ఏమిటి? ఎవరి కలలు వాళ్ళు కనేందుక్కూడా తీరికలేని పరుగుల ప్రపంచంలో, ఇంకొకరి కలల్ని చూద్దామన్న కోరికా తీరికా ఎవరికుంది? అందువల్ల సుబ్బరామయ్య గారు చేయమన్న పని సరైనది కాదు. ఈ నిర్ణయానికొచ్చేసరికి అర్ధరాత్రి దాటింది. అయిననూ, సుబ్బరామయ్యగారు నన్ను నిద్రపోనీలేదు. నందలూరు ఎక్కడుందో, సుబ్బరామయ్యగారు ఏం రాశారో నాకు తెలీదు. నాకు తెలీని, నేను చూడని సుబ్బరామయ్యను చూడ్డానికి ప్రయత్నిస్తున్నాను. ఎంత ప్రయత్నించినా అస్పష్ట రూపమే. ఆ అస్పష్టరూపం నుంచే ఆశ్చర్యకరంగా ఇంకో స్పష్ట రూపం వెలువడింది. అంతకంటే ఆశ్చర్యం కలిగించింది ఆ రూపం నాకు బాగా పరిచయమైన మనిషిదనిపించడం! ఎవరాయన? ఆయనెవరు? సుబ్బరామయ్యనంటే చూడలేకపోయాను. కాని స్పష్టంగా కనిపిస్తున్న ఈ తెలిసిన మనిషి ఎవరో ఎందుకు గుర్తుకు రావడం లేదు? ఓ... గుర్తుకొచ్చింది, ఈయన... ఆయన!



నీళ్ళులేక పండ్లతోటలు ఎండిపోతుంటే, పెంచిన చేతుల్తోనే తోటనంతా నరికేసుకున్నదీ, ప్రాణంగా చూసుకున్న పైరు వాన రాక చచ్చిపోతుంటే ప్రాణమొప్పకున్నా దున్నుకొని పూర్తిగా చంపేసుకున్నదీ... ఈయనే! ఈయన ఇప్పుడెందుకు కనిపించినట్టు? అర్థమయింది. సుబ్బరామయ్య తనతో పాటు తను శ్రమించి చేసిన రచనల్ని కూడా దహనం చెయ్యమని ఎందుకన్నదీ అర్థమయ్యింది.

ఇప్పుడు సుబ్బరామయ్య కూడా స్పష్టంగానే కనిపిస్తున్నాడు.

**- పి. రామకృష్ణ, 94909 42587**

# బేతాళ ప్రశ్న - 15



విజయ కరెంట్ బిల్లు కట్టలేదని కరెంట్ కట్ చేశారు. అగ్గిపెట్టెలో చూస్తే ఒకే ఒక్క అగ్గిపుల్ల మిగిలి ఉంది. ఆమె ముందు ఒక కిరోసిన్ దీపం, ఒక కొవ్వొత్తి, పాత పేపర్ ముక్కలు ఉన్నాయి. విజయ ముందు దేన్ని వెలిగిస్తుంది?

**సమాధానం వచ్చేవారం!**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే సమాధానంతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**

**గతవారం సమాధానం:** "పదికి మూడు కలిపితే ఒకటి వచ్చేది గడియారంలో మాత్రమే! ఉదాహరణకు ఇప్పుడు సమయం పది అవుతుందనుకుంటే మరో మూడు గంటల తర్వాత ఒంటిగంట (ఒకటి) అవుతుంది" అని సమాధానం చెప్పి యువరాణిని పెళ్లాడాడు రాకుమారుడు.

**బేతాళ ప్రశ్న-13కు సరైన సమాధానం పంపిన మొదటి ముగ్గురు:**
**దుర్గాప్రసాద్**, గాజువాక, **బోడ విష్ణు**, నల్గొండ
**ఎం.డి. అలీసా ఖద్రీ**, నర్సలా




**జ్యోతి,**
8వ తరగతి
భారతీయ విద్యాభవన్,
తాడేపల్లిగూడెం
పశ్చిమగోదావరి జిల్లా



## మీకు తెలుసా!



- గోల్డ్‌ఫిష్ జ్ఞాపకముంచుకునే సమయం కేవలం 3సెకన్లట.
- దోమలు నీలిరంగుకు ఎక్కువగా ఆకర్షింపబడతాయి.
- కొన్ని రకాల పక్షులు గూళ్లు కట్టుకుంటాయి గానీ వాటిలో నిద్రపోవు.
- జపాన్‌లో ఏటా పదిహేనువందల భూకంపాలు వస్తాయి.
- జెల్లీఫిష్‌ల గుంపును స్మాక్ అంటారు.




## గడ్డం రాబందు



సాధారణంగా రాబందులంటే మనకు బోడితలల పక్షులే గుర్తొస్తాయి కదూ! కానీ ఇది వాటికి భిన్నమైనది. 'ప్రాచీన ప్రపంచపు రాబందు'గా పిలుచుకునే ఈ గడ్డం రాబందు దక్షిణ ఐరోపా, ఆఫ్రికా, ఇండియాలలో మాత్రమే కనిపిస్తుంది. నెత్తిపైన ఈకలుండే ఈ రాబందుకు ముక్కు కింద నల్లటి వెంట్రుకలు వేలాడుతూ ఉండటం వల్ల 'బియర్డెడ్ వల్చర్' అని పిలుస్తారు. దీని అసలు పేరు లేమర్‌గీర్ (lammergeier). ఇవి అంతరించిపోయే దశలో ఉన్నాయట. ప్రస్తుతం మూడు ఖండాల్లోనూ కలిపి వీటి జనాభా పదివేలు మాత్రమే.

## పర్‌ఫెక్ట్ డాగ్ గోల్‌కీపర్



జపాన్‌లోని సకురా ప్రాంతానికి చెందిన మకోటో కుమాగై అనే ఆసామికి తొమ్మిదేళ్ల వయసున్న పురిన్ అనే చిన్న వేటకుక్క ఉంది. దానికి బాల్ క్యాచింగ్‌లో ట్రైనింగ్ ఇచ్చాడు ఆయన. ఫలితంగా పురిన్ ముందరి కాళ్లతో నిమిషంలో పధ్నాలుగు బంతులు పట్టుకుని 22 మార్చి 2015న గిన్నిస్ వరల్డ్ రికార్డులకెక్కింది.

## దారి కనుక్కోండి



## చరిత్రకు అందని ఆలయం



చరిత్ర పుటలకు అందకుండా దాక్కున్న ఎన్నో దేవాలయాల్లో ఒకటి మస్రూర్ రాక్ కట్ టెంపుల్. హిమాచల్‌ప్రదేశ్‌లోని కాంగ్రా లోయలో ఉన్న ఈ దేవాలయాన్ని ఒకే కొండని తొలచి నిర్మించారు. క్రీ.పూ. 6వ శతాబ్దంలో దీని నిర్మాణం జరిగిందని అంచనా వేస్తున్నారు. మహాబలిపురం, ఎల్లోరాల శిల్పకళకూ, మస్రూర్ రాతి దేవాలయంలో శిల్పాలకూ పోలిక ఉంది. అయితే అవన్నీ దీని తర్వాత నిర్మితమైనవే కాబట్టి, వాటికి స్ఫూర్తి ఈ దేవాలయమే అయ్యుండవచ్చు అని కొంతమంది పరిశీలకులు భావిస్తున్నారు. ఈ దేవాలయం ముందు ఉన్న కోనేరులో నీరు ఏడాది పొడవునా ఒకేలా ఉండటం విశేషం. ఆ నీటిలో దేవాలయ ప్రతిబింబం కనిపిస్తూ ఉంటుంది.

## రంగులు వేయండి








# ట్రాన్స్‌పోర్ట్ మ్యూజియం

**'షోలే'** సినిమా చూసిన వారెవ్వరూ 'అరె ఓ సాంబా' అంటూ పిలిచే గబ్బర్‌సింగ్‌నూ... 'ఏ దోస్తీ హమ్ నహీ తోడేగే' పాటను అస్సలు మర్చిపోలేరు.. అంతేకాదు ఆ పాటలో ధర్మేంద్ర, అమితాబ్ బచ్చన్ ఎక్కిన స్కూటర్‌నూ మర్చిపోయే అవకాశం లేదు. ఆనాడు ఆ సూపర్ హీరోలు ఎక్కి నడిపిన ఆ బండి ఇప్పుడెక్కడుందో తెలుసా... ఒక మ్యూజియంలో! స్కూటరేమిటీ మ్యూజియంలో ఉండడమేమిటీ అనే సందేహం కలుగుతోంది కదూ!

సాధారణ మ్యూజియంలో అయితే పురాతన వస్తువులు, మట్టి పాత్రలు, గ్రంథాలు, వస్త్రాలు ఉంటాయి. ఉంటే గింటే ఆనాటి రాజులు వాడిన వాహనాలు ఒకట్రెండు ఉంటాయి. అయితే 'హెరిటేజ్ ట్రాన్స్‌పోర్ట్ మ్యూజియం'లో మాత్రం కేవలం వాహనాలు, వాటికి సంబంధించిన వస్తువులు మాత్రమే ఉంటాయి. హర్యానాలోని గుర్‌గావ్ జిల్లాలో ఉందీ మ్యూజియం. దాదాపు లక్ష చదరపు అడుగుల విస్తీర్ణంలో నిర్మించిన ఈ మ్యూజియాన్ని తరుణ్ తక్రల్ స్థాపించారు.

"ఆదిమానవుడు ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి ప్రయాణించడం మొదలుపెట్టిన తర్వాతే నాగరికత పుట్టింది. వ్యవసాయం వచ్చింది. నేడు మనం చూస్తున్న టెక్నాలజీ సాధ్యమైంది. మన దేశ రవాణా వ్యవస్థకు ఎంతో పురాతన చరిత్ర ఉంది. ఏనుగులు, గుర్రాలు, గాడిదలను కూడా రవాణా




మాధ్యమాలుగా ఉపయోగించారు మన పూర్వీకులు. అటువంటి అతి పురాతన రవాణా వ్యవస్థకు సంబంధించిన చరిత్రను భావితరాలకు అందించాలనే ఆలోచనే ఈ మ్యూజియం స్థాపించడానికి కారణం" అని చెప్పారు తరుణ్.

మన దేశంలో తయారైన, వినియోగించిన అరుదైన వాహనాలను సేకరించేందుకు ఈయనకు రెండు దశాబ్దాల




కాలం పట్టింది. 1982లో 'హెరిటేజ్ ట్రాన్స్‌పోర్ట్ ట్రస్ట్'ను స్థాపించిన తరుణ్, అప్పట్నించి భారత రవాణాకు సంబంధించిన ప్రతి చిన్న వస్తువునూ సేకరించడం మొదలుపెట్టాడు. ఈ సేకరణలో మరో 5 ట్రస్ట్‌లు తరుణ్‌కు సహాయం చేశాయి. ఎన్నో వ్యయ ప్రయాసలు పడి అనేక రకాల వాహనాలను సేకరించి ఎట్టకేలకు 2013 డిసెంబర్ 6న ఈ మ్యూజియాన్ని ప్రారంభించారు. మన దేశంలో ఇదే మొదటి, ఏకైక ట్రాన్స్‌పోర్టు మ్యూజియం కావడం విశేషం.

ఎన్నో ఏళ్లుగా ఎవరూ పట్టించుకోక దుమ్ము పట్టి శిథిలావస్థకు చేరిన వాహనాలకు రకరకాల డిజైన్లలో పెయింటింగ్స్ వేసి అందంగా తీర్చిదిద్దుతారు ఈ మ్యూజియంలో. కొన్ని వాహనాలకు బాలీవుడ్ స్టార్ల పెయింటింగ్స్ కూడా ఉంటాయి. ఇక్కడ కార్లకు, ద్విచక్ర వాహనాలకు, రైలు, విమానాలకు సంబంధించిన వాటికి ప్రత్యేకంగా విభాగాలు ఉన్నాయి. మ్యూజియంలోకి ప్రవేశించగానే బండి చక్రం నుంచి నేడు ఉపయోగిస్తున్న వాహనాల దాకా ఇప్పటిదాకా మనం ఉపయోగించిన చక్రాలన్నింటినీ ఒకచోట చేర్చి అమర్చిన 'టైమ్ వీల్' మనకు స్వాగతం చెబుతుంది.

మోటారు వాహనాలు లేక ముందు రవాణాకు జంతువులను ఉపయోగించేవారనే విషయం తెలిసిందే. వాటి కోసం ఆనాడు వాడిన అనేక రకాల తివాచీలు, గుర్రపు బండ్లు, ఎద్దుల బండ్లు కూడా ఇక్కడ మనకు కనిపిస్తాయి. వాటిని అలంకరించేందుకు వాడిన అందమైన వస్త్రాలను కూడా ఇక్కడ చూడవచ్చు. మహారాజులు, రాణులు, ధనవంతులు ఉపయోగించిన పల్లకీలు, వాటి ముందు వెలుతురు కోసం పరుగెత్తుతూ పనివాళ్లు పట్టుకునే దీపపు కుందెలు ఒక విభాగంలో దర్శనమిస్తాయి.

రైల్వే విభాగం ఈ మ్యూజియంలోనే ఒక ప్రత్యేక ఆకర్షణ. రైల్వే స్టేషన్లలో సిగ్నల్స్ ఇచ్చేందుకు స్టేషన్ మాస్టర్ పట్టుకునే లైట్లు, గడియారాలు, వాటిలో వచ్చిన మార్పులు రైలు పెట్టెల్లోకి వెళ్లి చూడొచ్చు. రైలు పెట్టెల మీద వివిధ సంస్థలు ఇచ్చిన ప్రకటనలను కూడా సేకరించిపెట్టారు ఈ మ్యూజియంలో. వాహనాల్లో ఉపయోగించే వివిధ రకాల రేడియోలు, టేపురికార్డర్లను కూడా వీక్షించవచ్చు. వీటితో పాటు రెండో ప్రపంచ యుద్ధంలో ఉపయోగించిన యుద్ధ వాహనాలు, విమానాలు కూడా ఈ మ్యూజియంలో కొలువై ఉన్నాయి. 1946లో పైలట్ల శిక్షణకు ఉపయోగించిన పైపర్ కబ్ జె3సి (Piper Cub J3C) విమానం ఆకాశంలో వేలాడుతున్నట్టుగా ఉంటుంది. ఇవేకాకుండా చిన్న పిల్లలు ఆడుకునేందుకు తయారుచేసే బొమ్మ వాహనాల్లో వచ్చిన మార్పులను కూడా ఈ మ్యూజియంలో గమనించి తెలుసుకోవచ్చు.

పూర్తిగా అద్దాలతో అందంగా అలంకరించిన 1960 చెవర్లెట్ మోడల్ కారు కార్ల విభాగం మధ్యలో వేలాడేసి ఉంటుంది. కేవలం వాహనాలు, వాటికి ఉపయోగించే వస్తువులు మాత్రమే కాకుండా రవాణా వ్యవస్థలో మార్పుల గురించి వచ్చిన వార్తలను, కథనాలను ప్రచురించిన వార్తాపత్రికలను కూడా ఈ మ్యూజియంలో చదవవచ్చు.






ముంబై, థానేల మధ్య మొదటి రైల్వే లైనును ప్రారంభించిన 'గ్రేట్ ఇండియన్ పెనిన్సులా' రైల్వే సంస్థ ఏఏ ప్రాంతాలకు రైలు సర్వీసులు నడపబడుతున్నాయో తెలుపుతూ 1929లో ఇచ్చిన మొదటి రైల్వే ప్రకటన,

టాటా ఎయిర్‌లైన్స్ ప్రారంభించినప్పుడు 1932లో జెంషెడ్‌జీ టాటా ఉపయోగించిన ఏరియల్ రూట్‌మ్యాప్, ఆనాటి ఎయిర్ లైన్ల పోస్టర్లు, ఇలాంటి మరెన్నో రవాణా సంబంధిత పురాతన ప్రకటనలు కూడా ఉన్నాయిక్కడ. వాహనాలకు ఉండే వివిధ రకాల అద్దాలనే ఇక్కడ బాత్‌రూముల్లో పెట్టారు. కూర్చోడానికి కుర్చీలు కూడా ఆటో సీటు లాగానో, అంబాసిడర్ డిక్కీలో సోఫా అమర్చినట్టుగానో ఉంటాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే సింధు నాగరికత ఆరంభం నుంచి ఇప్పటి దాకా వచ్చిన ప్రతీ రవాణా సాధనాన్ని ఈ మ్యూజియంలో చూడవచ్చు.

పూర్తి రవాణా చరిత్రను ఒక చోటికి చేర్చిన తరుణ్ కృషికి కేంద్రప్రభుత్వం ఆరునెలల క్రితం అతనికి 'నేషనల్ టూరిజం అవార్డ్' ఇచ్చింది. షారుఖ్‌ఖాన్, మాధురి దీక్షిత్, కరిష్మాకపూర్ నటించిన 'దిల్ తో పాగల్ హై' సినిమాలో షారుఖ్ వాడిన ప్రత్యేకమైన కారు కూడా ఈ మ్యూజియంలోనే ఉంది. ■

---

# ది గ్రేట్ 'పరోటా' ఛాలెంజ్!






హర్యానాలోని రోహతక్ సిటీ ఢిల్లీ బైపాస్ రోడ్డు పక్కన ఉన్న 'తాపస్య పరోటా' జంక్షన్‌కు వెళితే వెల్‌కం బోర్డు పక్కనే '50 నిమిషాల్లో మూడు పరోటాలు తింటే రూ. 5100/- బహుమతి' అని తెలిపే ఇంకో పెద్ద బోర్డు కూడా కనిపిస్తుంది. ఈ బోర్డు చదవగానే ఎవరికైనా "కేవలం మూడు పరోటాలు.. అదీ 50 నిమిషాల్లో.. తినలేమా? తేలిగ్గా తినేయొచ్చు. ఇది కూడా ఒక ఛాలెంజేనా" అని ఆశ్చర్యం కలుగకమానదు. కాని అక్కడే ఉంది అసలు రహస్యం. ఇవి మనం హైవేల్లో రోడ్డు పక్కన దాబాల్లో తినే అల్లాటప్పా సాధారణ పరోటాలు కావు. భారతదేశంలోనే అతి పే...ద్ద పరోటాలు. ఎంత పెద్దవంటే ఒక్కో పరోటా అడుగున్నర (పద్దెనిమిది అంగుళాలు) వెడల్పు, దాదాపు ఒక కేజీ బరువు దాకా ఉంటాయి. అరకిలో మైదా పిండిలో మరో అర కిలో కూరను పెట్టి ఈ పరోటాలను తయారుచేస్తారు. వీటిల్లో కందిపప్పుతో ఉల్లిపాయ స్పెషల్, మిక్స్‌డ్ వెజిటబుల్ స్పెషల్, ఆలూ గోబీ ఉల్లిపాయ స్పెషల్, పాలక్ పనీర్ మిక్స్, హిందుస్థాన్ స్పెషల్ పరోటా (డ్రైఫ్రూట్ మిక్స్) అనే వెరైటీ రకాలు కూడా ఉంటాయి. 90 రూపాయల నుంచి మొదలయ్యే ఈ పరోటాల్లో హిందుస్థాన్ స్పెషల్ పరోటా ఖరీదు 300 రూపాయలు ఉంటుంది. ఇంత భారీ సైజు ఉన్నాయి కాబట్టే ఛాలెంజ్‌ను తీసుకున్నవాళ్లెవరూ కనీసం రెండు పరోటాలను కూడా పూర్తిగా తినలేకపోయారట. 50 నిమిషాల్లో మూడు పరోటాలను తినగలిగితే 5100 రూపాయల నగదు బహుమతితో పాటు జీవితకాలం తమ దాబాలో ఉచితంగా తిండి పెడతామని ధీమాగా చెబుతున్నారు తాపస్య పరోటా జంక్షన్ యజమానులు. ఈ ఛాలెంజ్ వల్ల పరోటాలు ఎంత పాపులర్ అయ్యాయంటే కాలనీని 'పరోటావాలీ గల్లీ' అని పిలుస్తున్నారు స్థానికులు.

# ఎందుకు...?



## శంఖంలో సముద్ర హోరు...?



శంఖాన్ని చెవి దగ్గర పెట్టుకుంటే సముద్రహోరు వినిపించడం చాలామందికి అనుభవమే. అయితే ఎందుకలా వినిపిస్తుందో తెలియదు. సముద్రంలో పుట్టడం వల్ల అలా వినిపిస్తుందా? అంటే కాదనే చెప్పాలి. శంఖం ఆకారమే ఆ హోరుకు కారణం. ఆ ఆకారంలో గాలి చిక్కుకుపోయినట్లవుతుంది. చిక్కుకుపోయిన గాలి శంఖం పరిణామానికి అనుగుణంగా కంపనాలు చేస్తుంది. ఆ కంపనాలే సముద్ర హోరుగా వినిపిస్తాయి. శంఖం మాదిరిగా చేతిని ముడిచి చెవి దగ్గరకు తీసుకెళ్లినపుడు కూడా సముద్రహోరు అనుభవాన్ని పొందవచ్చు.

## పావురాలు చెట్లపై వాలవు...?



సహజంగా పక్షులు ఎక్కువగా చెట్లపై, కరెంటు తీగలపై వాలడం మనం చూస్తుంటాం. కానీ పావురాలు మాత్రం బిల్డింగులపైనే ఎక్కువ వాలతాయి. అక్కడే నివసిస్తాయి. కారణం మిగిలిన పక్షులకూ, పావురాలకు మధ్య కాళ్ల నిర్మాణంలో భేదాలు ఉండటమే. పక్షుల కాలి వేళ్ల కొమ్మలను, తీగలను పట్టుకునేందుకు వీలుగా వంగుతాయి. అందువల్ల ఎంత గాలి వీచినా అవి కింద పడిపోకుండా ఉంటాయి. కానీ పావురాల వేళ్ల అలా వంగవు. అలాగే నేలపైన, గట్లపైన కూడా పావురాళ్ల ఎక్కువసేపు నడవలేవు.

## అంతకంటేనా!

"ఈ రోజు నుండి నీతో మాట్లాడకూడదని నిర్ణయించుకున్నాను" చెప్పింది భార్య.

"సరే" బదులిచ్చాడు భర్త.

"ఎందుకో తెలుసుకోవాలని లేదా?" ఆశ్చర్యపోయింది భార్య.

"అక్కర్లేదు. నీ మాటపైన గౌరవముంది" చెప్పాడు భర్త.

## మిక్స్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

### కృతజ్ఞత ఉండాలోయ్!



"శ్రీవీర వెంకట సత్య నారాయణ లక్ష్మీ సాయి గణేశ్ కనకదుర్గా ఆంజనేయ శివన్నారాయణ ఫుట్ వేర్ ... అబ్బ! ఎందుకు బాబాయ్ మన చెప్పుల షాపుకు ఇంత పొడవు పేరు పెట్టావు?"

"ఆ గుళ్లలో కాజేసిన చెప్పులతోనే కదరా నేను ఈ షాప్ పెట్టింది .. ఆ మాత్రం కృతజ్ఞత చూపొద్దూ!"

## వాళ్లిద్దరూ సమానం!

"ఏరా ఏకాంబరం .. మీ ఆవిడ కరాటేలో బ్లాక్ బెల్ట్ అట కదా .. గొడవ వస్తే నీకేం ప్రాబ్లమ్ లేదా .." అడిగాడు పీతాంబరం.

"నువ్వన్నది నిజమే. కాని నేను రన్నింగ్‌లో గోల్డ్ మెడల్ గ్రహీతననే సంగతి మరిచావా?" గుర్తుచేశాడు ఏకాంబరం.

### సుబ్బి పెళ్లి ఎంకి చావుకు



"రేపట్నించి టూ వీలర్ వెనక కూర్చున్న వాళ్లు కూడా హెల్మెట్ పెట్టుకోవాలంట. లేకపోతే ఫైనేస్తారట" దినపత్రిక చూస్తూ చెప్పాడు భర్త.

"అయితే పదివేలివ్వండి. మార్కెట్‌కు వెళ్లి చీరల మీదకి మ్యాచింగ్ హెల్మెట్లు కొనుక్కొస్తా" చెయ్యి చాస్తూ అడిగింది భార్య.

## నడిచేరకం కాదు

"ఊబకాయం మా కుటుంబమందరిలో 'రన్' అవుతూనే ఉంది డాక్టర్" చెప్పాడు పాండురంగం.

"మీ కుటుంబంలో ఎవరూ 'రన్' చేయరనండి .. బాగుంటుంది" బదులిచ్చాడు డాక్టర్.

## ఛాయా'చిత్రం'




"చింటూ .. అంతలా వర్రీ అవకు. నెక్స్ట్ టైం ఆడినప్పుడు గెలుద్దువులే - ఇంట్లోకి రా .. "

## సలహా

"రోజూ 2 గంటల ప్రయాణం ... బస్‌లో వెళ్తుంటే చుక్కలు కనిపిస్తున్నాయిరా .." చెప్పాడు శ్రీకాంత్.

"లెక్కపెట్టుకుంటూ వెళ్లు .. టైం పాస్ అవుతుంది" సలహా ఇచ్చాడు శశికాంత్.

## దేవుడి టార్చ్

"వాన వచ్చేప్పుడు మెరుపులు ఎందుకొస్తాయి?" అడిగాడు చింటు.

"భూమి పూర్తిగా తడిసిందో లేదో చూసుకోవడానికి దేవుడు వేసే టార్చ్‌లైటు అది" చెప్పాడు బంటి.

## మామా! తప్పుకో!!



విమాన ప్రయాణంలో ఇండియన్స్‌కి వైన్ ఇవ్వడం నిషేధించారు. ఎందుకంటే - తాగిన తర్వాత మిగతా దేశాలవాళ్ల ప్రవర్తనకూ మన వాళ్ల ప్రవర్తనకూ మధ్య చాలా తేడా ఉంటోందట.

బ్రిటిషర్ - నేను పడుకుంటా!
అమెరికన్ - నేను ఇంటర్నెట్‌లో పనిచేసుకుంటా!
జర్మన్ - నేను మ్యూజిక్ వింటా!
చైనీస్ - నేను సినిమా చూస్తా!
ఇండియన్ - మామా, తప్పుకో! నేను ఫ్లైట్ నడుపుతా!

## పేద విద్యార్థి

"సుశీల్ .. రోజంతా అమ్మాయిలతో మాట్లాడుతూనే ఉంటావెందుకు?" మందలించింది టీచర్.

"నేను చాలా బీదవాడ్ని టీచర్. నా ఫోన్లో వాట్సప్ లేదు" చేతులు కట్టుకుని బదులిచ్చాడు స్టూడెంట్.

# సరిహద్దు గ్రామాలు

ఈ వారం కవిత

ఎప్పుడు ఎవరు చస్తారో తెలియదు
చస్తారు కూడా.
చీకటి
చనిపోయినవారి నీడలా వ్యాపిస్తుంది.
సరిహద్దు గ్రామాల్లో
హద్దులు లేని అభద్రత.
భయం కూడా అలవాటయిపోతుంది
రోగం లాగ.

ఒక్క పూటలో
జీవితాన్ని రవాణా చేయటమంటే
మాటలు కాదు.
దాని కన్న
ప్రాణాలు వదలటమే సులభం.

తట్టా బుట్టా సర్దుకోవచ్చు
అనుబంధాలనూ జ్ఞాపకాలనూ
ఊడ్చి గంపకెత్తుకోవడం
ఎంత కష్టం!

అవతలి వైపునుంచి
తుపాకులు పేలుతుంటాయి.
జవాబుగా ఇక్కడి నుంచి కూడా.
గత యుద్ధంలోని క్షతగాత్రులు
నిన్నటిదాకా హీరోలు
ఇవాళటి నుంచి
వారిని ఎవరూ పట్టించుకోరు.

కోతకొచ్చిన పొలాలనేం చేస్తావు
నెలల తరబడి ప్రవహించిన
చెమట నదుల నేం చేస్తావు
జీవితాంతం దాకా
పసిపిల్లల కనుల్లో మెదిలే
పీడకలల నెలా తొలగిస్తావు.

బొమ్మ : అక్బర్



అయ్యో!
క్షణక్షణం చావటం కంటె
ఒక్కసారి మరణం మేలు.
టపాకాయలు కాల్చడం కంటె
తేలిపోయే యుద్ధం మేలు
దేశభక్తి మంచిదే
ఈ బలవంతపు దేశభక్తే విషాదం.

యుద్ధమంటే మనకు వార్త
వారికి అంతులేని అవస్థ
సరిహద్దు అంటే మనకు దేశపటం
వారికి
చావు బతుకుల మధ్య గీసిన గీత.

- డా. ఎన్.గోపి

# అనుగ్రహం

18-24 డిసెంబర్ 2016

డాక్టర్ పి.ఎ.రామన్



**మేషం : అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

గత తప్పిదాలు పునరావృతమయ్యే సూచనలున్నాయి. బాధ్యతగా మెలగండి. మీ అనుమానాలు నిజమవుతాయి. ఖర్చులు విపరీతం. రావలసిన ధనం వసూలుకు మరింతగా శ్రమించాలి. గురు, శుక్ర వారాల్లో పనుల ప్రారంభంలో ఆటంకాలెదుర్కుంటారు. పరిచయస్తుల రాక ఇబ్బంది కలిగిస్తుంది. కొత్త విషయాలు గ్రహిస్తారు. ఒక సమాచారం ఉపశమనం కలిగిస్తుంది. దళారుల పట్ల అప్రమత్తంగా ఉండాలి. అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. విలువైన వస్తువులు, నగదు జాగ్రత్త.



**వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

శుభవార్తలు వింటారు. కష్టానికి ప్రతిఫలం అందుతుంది. కొత్త యత్నాలు ప్రారంభిస్తారు. పరిచయాలు ఉన్నతికి తోడ్పడతాయి. కొన్ని పనులు అనుకోకుండా పూర్తి చేస్తారు. ఒప్పందాలకు అనుకూలం. శనివారం నాడు ఆచితూచి వ్యవహరించాలి. ఎవరిపై ఆధారపడవద్దు. స్వయంకృషితోనే రాణిస్తారు. ఆంతరంగిక విషయాలు వెల్లడించవద్దు. సంతానం భవిష్యత్తుపై మరింత శ్రద్ధ అవసరం. దంపతుల మధ్య సఖ్యత నెలకొంటుంది. జూదాలు, బెట్టింగ్‌ల వల్ల చిక్కుల్లో పడే ఆస్కారం ఉంది.



**మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

ఈ వారం ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. అవసరాలు నెరవేరుతాయి. చిన్నారులు, ఆత్మీయులకు కానుకలు అందిస్తారు. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. ఆరోగ్యం పట్ల అలక్ష్యం తగదు. వైద్య పరీక్షలు అవసరమవుతాయి. పెద్దలతో సంప్రదింపులు జరుపుతారు. మీ అభిప్రాయాలకు ఆశించిన స్పందన వస్తుంది. పదవుల స్వీకరణకు అనుకూలం. స్తోమతకు మించిన హామీలివ్వవద్దు.



**కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

ఆర్థికస్థితి సామాన్యం. యత్నాలు ఫలించక నిరుత్సాహం చెందుతారు. మీ సమర్థతపై నమ్మకం పెంచుకోండి. స్వయంకృషితో అనుకున్నది సాధిస్తారు. ఆలస్యంగానైనా అనుకున్న విధంగా పనులు పూర్తి కాగలవు. ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది. నూతన పెట్టుబడులకు తరుణం కాదు. బంధుమిత్రులతో సంప్రదింపులు జరుపుతారు. ఎవరినీ తక్కువ అంచనా వేయొద్దు. ఎదుటివారి ఆంతర్యం గ్రహించండి.



**సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

విమర్శలు, అభియోగాలకు దీటుగా స్పందిస్తారు. మీ ఆగ్రహావేశాలను అదుపులో ఉంచుకోండి. అకారణంగా మాటపడవలసి వస్తుంది. ఆది, సోమ వారాల్లో పనులు సాగక విసుగు చెందుతారు. ఖర్చులు సామాన్యం. ధనానికి ఇబ్బంది ఉండదు. నగదు స్వీకరణ, చెల్లింపుల్లో జాగ్రత్త. ప్రియతముల రాక ఉత్సాహాన్నిస్తుంది. సంతానం విషయంలో శుభపరిణామం సంభవం. అధికారులు, ఉద్యోగస్తులకు ఒత్తిడి, పనిభారం. ప్రస్తుత వ్యాపారాలే శ్రేయస్కరం. దైవ,సేవా, సామాజిక కార్యక్రమాల్లో పాల్గొంటారు.



**కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

అనుకున్న లక్ష్యాన్ని సాధిస్తారు. గౌరవ ప్రతిష్టలు పెంపొందుతాయి. బాధ్యతగా వ్యవహరించాలి. రోజువారీ ఖర్చులే ఉంటాయి. ఆత్మీయులకు సాయం అందిస్తారు. పనులు సకాలంలో పూర్తి కాగలవు. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. మంగళ, బుధ వారాల్లో తొందరపడి హామీలివ్వవద్దు. మీ ఇష్టాయిష్టాలను లౌక్యంగా వ్యక్తం చేయండి. ఒక సంఘటన ఆందోళన కలిగిస్తుంది. నోటీసులు, పత్రాలు అందుకుంటారు. మీ శ్రీమతి విషయంలో దాపరికం తగదు.



**తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

ఆత్మీయులతో ఉల్లాసంగా గడుపుతారు. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. పరిచయం లేని వారిని విశ్వసించవద్దు. వ్యవహారాలు స్వయంగా చూసుకోవాలి. ఇతరుల బాధ్యతలు చేపట్టి ఇబ్బందులెదుర్కుంటారు. గురు, శుక్ర వారాల్లో పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. పెద్దలతో సంప్రదింపులు జరుపుతారు. దంపతుల మధ్య అవగాహన నెలకొంటుంది. సంతానం అత్యుత్సాహాన్ని అదుపు చేయండి.



**వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

ఆర్థిక లావాదేవీలతో హడావుడిగా ఉంటారు. కొన్ని సంఘటనలు మనస్థిమితం లేకుండా చేస్తాయి. ధనమూలక సమస్యలెదుర్కుంటారు. ప్రముఖులతో సంప్రదింపులు జరుపుతారు. శనివారం నాడు పనులు సాగక విసుగు చెందుతారు. ఒక సమాచారం ఉపశమనం కలిగిస్తుంది. బంధుమిత్రులతో విభేదాలు, చికాకులు తలెత్తుతాయి. మీ ఆగ్రహావేశాలు అదుపులో ఉంచుకోండి. సంతానం భవిష్యత్తుపై మరింత శ్రద్ధ అవసరం. గృహ నిర్మాణాలు మందకొడిగా సాగుతాయి.



**ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

అందరికీ యోగదాయకమే. యత్నాలు ప్రోత్సాహకరంగా సాగుతాయి. గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. సన్నిహితులకిచ్చిన మాట నిలబెట్టుకుంటారు. పనులు నెమ్మదించినా అనుకున్న విధంగా పూర్తి కాగలవు. వ్యవహారాలు స్వయంగా చూసుకోవాలి. ఆది, సోమ వారాల్లో ఆశ్చర్యకరమైన వార్తలు వింటారు. అతిగా ఆలోచించవద్దు. ఆందోళన కలిగించిన సమస్య నిదానంగా సద్దుమణుగుతుంది.



**మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

కొన్ని ఇబ్బందుల నుంచి బయటపడతారు. నిరుత్సాహం వీడి యత్నాలు సాగించండి. మీ కృషి త్వరలో ఫలిస్తుంది. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. మంగళ, బుధ వారాల్లో ఆచితూచి వ్యవహరించండి. ఎవరినీ సలహా అడుగవద్దు. ఖర్చులు సామాన్యం. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. మీ శ్రీమతి ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. వ్యాపారాల్లో ఆటుపోట్లు, నష్టాలను దీటుగా ఎదుర్కుంటారు.



**కుంభం : ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ఆదాయ వ్యయాల్లో మీ అంచనాలు ఫలించవు. పెద్ద ఖర్చు తగిలే ఆస్కారం ఉంది. సాయం అర్థించటానికి ఇష్టపడరు. అవసరాలు వాయిదా వేసుకుంటారు. ఆది, గురు వారాల్లో శ్రమాధిక్యత మినహా ఫలితం శూన్యం. పనుల ప్రారంభంలో ఆటంకాలెదుర్కుంటారు. మీ శ్రీమతి సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది. విమర్శలు, అభియోగాలు ఎదుర్కుంటారు. మీ ఆగ్రహావేశాలను అదుపులో ఉంచుకోండి. ఎవరినీ నిందించవద్దు. సంతానం భవిష్యత్తుపై శ్రద్ధ అవసరం. దళారులను విశ్వసించవద్దు.



**మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

సమర్థతతో రాణిస్తారు. అవకాశాలు కలిసివస్తాయి. కొన్ని పనులు ఆకస్మికంగా పూర్తి చేస్తారు. యత్నాలకు కుటుంబీకుల ప్రోత్సాహం ఉంటుంది. ఖర్చులు సామాన్యం. విలువైన వస్తువులు అమర్చుకుంటారు. పత్రాలు, రశీదులు జాగ్రత్త. మంగళ, శని వారాల్లో పరిచయం లేని వారితో మితంగా సంభాషించండి. ఆంతరంగిక, కుటుంబ విషయాలు వెల్లడించవద్దు. ముఖ్యులలో ఒకరి గురించి ఆందోళన చెందుతారు. కార్యక్రమాలు వాయిదా వేసుకోవలసి వస్తుంది.

## అవునా!



నీలం రంగు చర్మం ఉండటాన్ని వైద్య పరిభాషలో మెతమోగ్లోబినీమియా (Methemoglobinemia) కండిషన్ అంటారు. 1800 సంవత్సరంలో ఓ కుటుంబం మొత్తం ఆ రంగులో ఉండేది.

- చరిత్రలో అత్యంత సుదీర్ఘ బాక్సింగ్ ఫైట్ 110 రౌండ్ల పాటు జరిగింది. అయినా చివరకు మ్యాచ్ టై అయింది.

- చిలీలోని అటకామా ఎడారిలో వర్షం పడిన దాఖలాలే లేవు.



- అమెరికా జాతీయ పతాకాన్ని రాబర్ట్ హెఫ్ట్ అనే పిల్లాడు తన స్కూలు ప్రాజెక్టులో భాగంగా డిజైన్ చేశాడు.

- ఇంగ్లీషులో అత్యంత పెద్ద పదంలో ఉన్న అక్షరాలు 1909. ఇది డీఎన్ఏలో ఒక భాగం పేరు.

- భూమ్మీదలో అత్యధిక వెన్నశాతం (45-50%) ఉన్న పాలు కలిగిన జంతువు సీల్.



- భీకరంగా గాండ్రించే పులులు మనుషులు విన లేని చిన్న శబ్దాలు కూడా చేయగలవు.

- ప్రతి ఖండంలోనూ రోమ్ అనే పేరుగల నగరం ఉంది.

- ప్రపంచంలో అతిపెద్ద మాంటిస్సోరి స్కూలు ఇండియాలోని లక్నోలో ఉంది. అందులో విద్యార్థుల సంఖ్య దాదాపు 52000.





# పుస్తకాల బావి

పుస్తకాలు క్రమపద్ధతిలో, రాక్‌లలో ఉంటే చదువుకోవటానికి బాగుంటుందిగానీ ఇలా ఉంటే ఎలా చదువుతారనే అనుమానం ఎవరికైనా వస్తుంది. ఇదొక పుస్తకాల బావి. కొన్నివేల పుస్తకాలను బావిలాగా అమర్చిందో తల్లి. దానికి ఒక కారణం ఉంది. పుస్తకాలను యాంత్రికంగా కాకుండా మనసు పెట్టి చదవాలని, లేదంటే బావిలో కప్పలాగే ఉంటారనే సందేశాన్ని తన కూతురుకు గుర్తుచేసేందుకే ఈ పుస్తకాల బావికి రూపకల్పన చేసినట్లు చెప్పిందామె. చైనాలోని జియాన్ నగరంలో ఉన్న ఒక కేఫ్‌లో రకరకాల పుస్తకాలతో ఈ పుస్తకాల బావిని ఏర్పాటుచేశారు. ఇక్కడికి వచ్చిన ప్రతీ ఒక్కరూ దీని ముందు ఫోటో దిగడమేగాక ఆ తల్లి సందేశాన్ని కూడా బుర్రకెక్కించుకుంటున్నారు.

అవీ-ఇవీ

# 'మొబైల్' జీవులు...

నగరాల్లో ప్రతి ఒక్కరి చేతుల్లో మొబైల్ ఫోన్ కనిపిస్తుంది. మనుషులతో కన్నా మొబైల్‌లోనే ఎక్కువగా మాట్లాడుతూ కనిపిస్తుంటారు. బస్సుల్లో, ఆటోలో, కారులో, బండిమీద, నడుస్తూ కూడా మొబైల్ చాటింగ్ చేయడం కామన్‌గా కనిపించే సీన్. ఇలా ప్రతీచోటా ఫోన్లతో బిజీగా ఉండేవారినే తన కెమెరాలో బంధించాలనుకున్నాడు ఫోటోగ్రాఫర్ వెర్మత్. లండన్‌కు చెందిన వెర్మత్ నగరాలలో వివిధ సందర్భాల్లో ఫోన్‌తో బిజీగా ఉన్న వ్యక్తుల ఫోటోలను కొన్ని వేలలో తీశాడు. వాటన్నింటినీ ఒక చోట చూస్తే జనం మొబైల్ ఫోన్ల మైకంలో ఎంతగా కూరుకుపోతున్నారో అర్థమవుతుంది. మొబైల్ సంబంధాల కన్నా మానవ సంబంధాలకు అధిక ప్రాధాన్యత ఇవ్వాలని చెప్పడానికే ఈ సిరీస్‌ను ఎంచుకున్నాడట వెర్మత్. ఈ ఫోటోలను కూడా కళాత్మకంగా తీయడం మర్చిపోలేదాయన.








# గడ్డం గ్యాంగ్

మగవాళ్ల వేషధారణలో పెద్దగా మార్పులేం ఉంటాయి? ఫార్మల్‌లో అయితే షర్టు, ప్యాంటు, ఇన్‌ఫార్మల్‌లో అయితే జీన్సు, టీషర్టు అంతేగా? ఎన్నో ఏళ్ల నుంచి వస్తోన్న ఈ స్టీరియోటైప్ గెటప్ బోర్ కొట్టేసింది విశాల్ సింగ్‌కి. కానీ డ్రెస్సింగ్ స్టైల్‌ని ఏమాత్రం మార్చలేమని తెలుసుకుని కాస్త డిఫరెంట్ గా కనిపించడానికి గడ్డంపై మక్కువ పెంచుకున్నాడు. అంతేకాదు... తనలాంటి వాళ్లని కలుపుకుని బిబిసి(బెంగళూరు బియర్డ్ క్లబ్)ని స్టార్ట్ చేశాడు.

గడ్డం పెంచుకోవడమూ ఒక న్యూసేనా... దీనికి మళ్లీ ఓ క్లబ్బా? అని కొట్టిపారేసేది కాదీ విషయం. గడ్డం తమకో సిగ్నేచర్ మార్క్‌గా నిలిచిపోవాలని కోరుకుంటున్న వాళ్లను కదిపితే గానీ తెలీదు... గడ్డానికి వాళ్ల జీవితాల్లో ఎంత విలువుందో! మే, 2016లో బిబిసిని ప్రారంభించిన విశాల్... భావసారూప్యత కలిగిన తనలాంటి వాళ్లను ఆరుగుర్ని అందులో సభ్యులుగా చేర్చుకున్నాడు. తర్వాత మరో ఇద్దరు చేర్చారు. నున్నగా షేవ్ చేసుకుని ఆఫీసులకు వెళ్లడం అనేది... బలవంతపు జీవనశైలి అని గాఢంగా నమ్ముతుందీ గడ్డం గ్యాంగ్.

"సమాజంలో ఎంత మార్పు వచ్చినా కొన్ని విషయాల దగ్గరకొచ్చేసరికి కొంతమంది ఆలోచనలు మారవు. గడ్డం పెంచుకునే వాళ్లకి జాలి ఉండదని, వాళ్లు ఎప్పటికీ మంచి భర్తలుగా, మంచి తండ్రులుగా ఉండలేరని కొంతమంది ముఖ్యంగా పాతతరం వాళ్లు అపోహ పడుతుంటారు. మరికొంతమంది గడ్డం అనేది కొన్ని మతాలకు, కొన్ని వర్గాలకు మాత్రమే పరిమితమైనది అనుకుంటారు. అలాంటి అపోహల్ని తొలగించి బియర్డ్‌కి ఓ రెస్పెక్టబుల్ ఇమేజ్ తీసుకు రావాలనేది మా ప్రయత్నం. అందుకే బిబిసికి రూపకల్పన చేశాం. మా ఆలోచనల్ని, మా ఆశల్ని కలబోసుకోవడానికి ఇదొక చక్కటి వేదిక" అని చెపుతాడు విశాల్.

విశాల్ మానవ వనరుల విభాగంలో పనిచేసేవాడు. గడ్డం పెంచుకోవడానికి వీలుండటం లేదనే ఉద్యోగం మానేశాడు. అప్పటినుంచి అంటే ఏడాది నుంచి గడ్డం పెంచడం మొదలు పెట్టాడు. ఇప్పటికి ఆరంగుళాల పొడవు పెరిగిందని గర్వంగా చెబుతాడు. "నిజానికి గడ్డం పెంచడం కష్టం కాదు. పడుకున్నా పెరుగుతుంది. కానీ గడ్డాన్ని మెయిన్‌టెయిన్ చేయడమే అసలు సమస్య. రోజూ నూనె పట్టించాలి. తర్వాత షాంపూ పెట్టాలి. ట్రిమ్ చేయాలి. గడ్డానికి ప్రత్యేకించిన దువ్వెనతోనే దువ్వుకోవాలి. ఇంత కథ ఉంది దీని వెనుక" అంటాడతను. ఈ గడ్డం పోషణకు అతడు రోజూ ఓ గంట సమయం కేటాయిస్తాడు. గడ్డాన్ని ట్రిమ్ చేయడం, దానికి ఆయిల్ పట్టించడం, ఒద్దికగా దువ్వడం... వంటి పనులన్నిటికీ ఆ మాత్రం సమయం తప్పనిసరి అంటాడు. బిబిసి క్లబ్ మెంబర్స్ తాము గడ్డాలు పెంచుకోవడమే కాదు. గడ్డాలు పెంచుకునే వాళ్లని ప్రోత్సహించడం కోసం పోటీలు కూడా నిర్వహిస్తున్నారు. అలా ఒక పోటీలో 'బెస్ట్ బియర్డ్' బహుమతి కొట్టేసిన ప్రజ్వల్ జాగిర్దార్... ఆ తర్వాత బిబిసిలో సభ్యత్వం తీసుకున్నాడు. అతడో ఓ ఐటీ ప్రొఫెషనల్. వాళ్ల కంపెనీలో క్లీన్‌షేవ్ తప్పనిసరి. అయితే గడ్డం పెంచుకోవడానికి కంపెనీ వాళ్ల అనుమతి తీసుకున్నాడు ప్రజ్వల్. అతగాడి గడ్డం నిర్వహణ ఖర్చు నెలకు మూడువేల రూపాయలు. అంత ఖర్చు ఎందుకంటే... "గడ్డాన్ని జాగ్రత్తగా కాపాడే ఉత్పత్తుల్లో చాలా భాగం ఇండియాలో దొరకవు. వాటిని విదేశాల నుంచి తెప్పించుకోవాల్సిందే" అంటాడు జాగిర్దార్.

వీరిలాగే సిక్కులు కూడా తమ గడ్డాన్ని చాలా జాగ్రత్తగా కాపాడుకుంటారు. అయితే వీరిది సంప్రదాయ శైలి.

కేవలం గడ్డాన్ని జాగ్రత్తగా సంరక్షించుకోవడంతో ఆగిపోలేదు ఈ గడ్డం గ్యాంగ్. తమ గడ్డానికి తగ్గట్టు డ్రెస్సింగ్, మ్యాచింగ్ యాక్ససరీస్ ఉండేలా జాగ్రత్త పడతారు. దేనిలోనైనా రాజీ పడతారు గానీ గడ్డం విషయంలో ఏమాత్రం రాజీ పడరట.

"ఆ గడ్డం నీకు అవసరమా?" అని విశాల్‌ని అడిగితే అతడు ఎమోషనల్‌గా "గడ్డం మాకు ఎనలేని ఆత్మవిశ్వాసాన్నివ్వడమే కాదు... అది మా వ్యక్తిత్వాన్ని పాజిటివ్‌గా ప్రభావితం చేస్తుంది. మా దృష్టిలో గడ్డం మా వ్యక్తిత్వానికి కొనసాగింపు. అంతే" అని కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడు. ఈ గడ్డం గ్యాంగ్‌కు ఆన్‌లైన్‌లో మంచి క్రేజ్ ఉంది. త్వరలో ముంబయ్, ఢిల్లీలలో బిబిసి బ్రాంచ్‌లు ప్రారంభించి... గడ్డాలు పెంచే యువకుల్లో సోదరభావాన్ని పెంపొందించాలని గడ్డం మీద ఒట్టేసుకుందీ గడ్డం గ్యాంగ్.

## అన్ని గడ్డాలు ఒకేలా ఉండవు. దేని స్టైల్ దానిదే. చాలా రకాలున్నా బాగా పాపులర్ అయిన కొన్ని గడ్డాలివే!

**బాల్బో :** గ్రీకువీరుడు సినిమాలో నాగార్జున పెంచుకున్న గడ్డం స్టైల్‌ని బాల్బో అంటారు. చుబుకం చిన్నగా ఉన్న వాళ్లకి ఇది నప్పుతుంది.





**బాండోల్జ్ :** ఎరిక్ బాండోల్జ్ అనే వ్యక్తి ఈ స్టైల్‌కి ఆద్యుడు. గుబురు గడ్డం, ఒత్తయిన మీసం ఈ స్టైల్‌లో కనిపిస్తాయి. కోల ముఖం వాళ్లకి ఈ స్టైల్ బాగా నప్పుతుంది.

**ఫ్రెంచ్ బియర్డ్ :** మీసం, గడ్డం సర్కిల్ షేపులో కలిసి పోయి కనిపించే ఈ స్టైల్‌ని బిగ్ బి అమితాబ్ చాన్నాళ్లు ఫాలో అయ్యారు. కోలముఖం వాళ్లకే కాదు... గుండ్రటి ముఖం వాళ్లకూ సూటవుతుంది.



**ఫ్రెండ్లీ మటన్ చాప్స్ :** ఈ స్టైల్ పేరే గమ్మత్తుగా ఉంది కదూ! యముడు సినిమాలో సూర్య గంభీరంగా కనిపించడానికి ఈ స్టైలే కారణం. కోల, చదరంగా ఉన్న ముఖాలకు చక్కగా సరిపోతుంది.



ఈ వారం కథ

ఎ.వి. రెడ్డి శాస్త్రి

**భార్యాభర్తలిద్దరూ చాలా బావుంటారు. తెల్లగా, ఏపుగా తీర్చిదిద్దినట్టు కనిపించే ఆకారాలతో. ఒకరంటే ఒకరికి ఎనలేని ప్రేమ. చాలా అనుకూల దాంపత్యం.**

**ఇప్పుడు భార్య గర్భవతి. భర్త ఆమెని అడుగు కింద పెట్టనివ్వడం లేదు. పువ్వుల మీద నడిపిస్తున్నాడు. తమకి పుట్టబోయే బిడ్డ ఏ దివ్య సౌందర్యాల్ని సంతరించుకుని వస్తుందోనని వేయికళ్ళతో ఎదురుచూస్తున్నారు భార్యాభర్తలు.**

# మధురిమ

**ఆ** శుభ సమయం రానే వచ్చింది. ఎంతో ఖరీదైన ఆస్పత్రిలో ప్రసవం అయిందామె. అమ్మాయి పుట్టింది. కాని పురిటి బిడ్డని చూస్తూనే తల్లి మూర్ఛపోయింది. హడావుడిగా నర్సులూ, డాక్టరూ ఆమె ముక్కు దగ్గర స్మెల్లింగ్ సాల్ట్ పెట్టారు... తెలివి తెప్పించడం కోసం.

ఈ లోపల భర్త లోపలికి వచ్చి బిడ్డని చూసాడు. మారుమాట లేకుండా బయటికి వెళ్ళిపోయాడు... ముఖాన్ని ఎర్రగా కందగడ్డలా చేసుకుని.

పిల్లని ఇంటికి తీసుకొచ్చారు. ఎవరి ముఖంలోనూ నెత్తురు చుక్కలేదు. వాళ్ళ పాలిపోయిన ముఖాల్లో ఏదో వేదన. పెద్దవాళ్ళు వచ్చి చూసారు. చూస్తూనే "ఇదేవిటీ మసిబొగ్గు రంగూ ఇదీనూ. ఎలా పుట్టిందే ఈ కురూపి?" అంటూ బుగ్గలు నొక్కుకున్నారు. బిడ్డ తల్లయితే పురిటి గది నుంచి బయటికే రావడం లేదు. కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ శోకదేవతే అయింది.

రెణ్ణెల్లు గడిచాయేమో ఘడియొక యుగంలాగ, ఒకనాడు భర్త తేల్చి చెప్పేశాడు- "అది నా బిడ్డ కాదు. మనం విడాకులు తీసుకుందాం" అని.

ఊహించని పిడుగు నెత్తిన పడ్డట్టయింది భార్యకి.

విడిపోయారు. తల్లీ, కురూపి పిల్ల మిగిలారు. తల్లిదండ్రుల దగ్గరికి వెళ్ళిందామె. ఆ ముచ్చటా అయిపోయింది. కూతుర్నీ, పిల్లని చూస్తూనే- చీదరిస్తున్నట్టు ముఖాలు పెట్టారు. తల్లి ప్రాణం చివుక్కుమంది. ఏదో అసహ్యకరమైన వస్తువుని చూసినట్టు చూసారు పిల్ల వంక. వాళ్ళూ తన భర్త ఉద్దేశాన్నే కలిగివున్నట్టు అనిపించింది. అంటే... తను పతితా? ఏవిటీ అన్యాయమైన ఆరోపణ?

ఏ డాక్టరు దగ్గరకైనా వెళ్ళి ఎందుకిలా జరిగిందని అడిగితేనో? తప్పకుండా ఏదో కారణం చెపుతాడు. కాని డాక్టరిచ్చే సమాధానం కళ్ళముందు కనిపిస్తున్న నిజాన్ని తుడిచి పారేయదు కదా! ఈ నల్లపిల్ల బంగారు రంగు పాపగా మారిపోదు కదా!

ఉద్యోగ ప్రయత్నాలు మొదలెట్టింది. పెళ్ళి కాకముందు తను పనిచేసిన సాఫ్ట్‌వేర్ కంపెనీ వాళ్ళే మళ్ళీ ఉద్యోగం ఇచ్చారు. జీతం పెద్దదే. పర్వాలేదు. తన అవసరాలకీ, పాప అవసరాలకీ సరిపోతుంది. విడిపోయిన భర్త ముందు చెయ్యి చాచవలసిన పరిస్థితి తప్పింది.



బొమ్మలు : **చారి పి.యస్.**

కాని తనేం చెయ్యాలిప్పుడు... ఈ దెయ్యపిల్ల గురించి? అది తనతోనే ఉంటే తన ఉనికినే ప్రశ్నిస్తుంది... చుట్టూ ఉన్న ప్రపంచం. అంచేత దీన్ని వీలైనంత వేగిరం వదుల్చుకోవాలి. తను ఉద్యోగం చేస్తున్న ఊరు చాలా పెద్దదే. అంచేత ఇలాంటి పిల్లల ఆలనా పాలనా చూసే హోమ్సు ఇక్కడ ఉండే ఉంటాయి, వెతికి పట్టుకోవాలి. నెట్‌ని జల్లెడ పట్టగా తను కోరుకున్న సదుపాయాలున్న హోమ్ దొరికింది. పిల్ల ఇబ్బంది పడకూడదు. దెయ్యప్పిల్లో, దేవత పిల్లో... తన కూతురే కదా! అంచేత సుఖంగా ఉండాలి ఎక్కడున్నా.

తను ఉంటున్న ఇంటికి ఓ పాతిక, ముప్పై మైళ్ళ దూరంలో ఉంది ఆ హోమ్. అందులో చేర్పించింది పిల్లని తప్పుడు సమాచారంతో. పిల్ల తనపిల్ల కాదు, తను కేవలం Foster mother అని చెప్పింది. హోమ్ వాళ్ళు తన మాటల్ని నమ్మారు. ఎందుకంటే ప్రత్యక్ష సాక్ష్యం కళ్ళముందే కనిపిస్తోంది కదా! తెల్లని తెలుపుతో మిసమిసలాడుతున్న స్త్రీకి ఇలాటి తారు నలుపు పిల్ల జన్మించే అవకాశం లేదు కదా! అందుకే నమ్మేరు- తను Foster mother అని చెపుతుంటే.

"పాప పేరు?"

అప్పటివరకూ తనకి తోచనేలేదు పాపకో పేరు ఉండాలని. వికృత రూపం కాదు గాని- నామకరణాలు, అలంకారాలు, అభిమానాలూ... అన్నీ మరుగునపడిపోయాయి. దీన్ని ఒదుల్చుకోడం ఎలా అన్నదొక్కటే ధ్యాసై కూర్చుంది.

అప్పటికప్పుడు మనసులో ఆలోచించుకుని "పేరా? మధురిమ అనుకుంటా" అంది. ఈ జవాబు విన్నాక హోమ్ వాళ్ళకి పూర్తి నమ్మకం కుదిరింది... పిల్ల తన బిడ్డ కాదని. ఏ తల్లయినా తన కూతురి పేరు చెప్పడానికి తడుముకుంటుందా? అందుకని నిశ్చయంగా తను Foster mother అనుమానం లేదు అనుకున్నారు.

ఆ విధంగా పిల్ల బాధ్యతని వదిలించుకుంది. వచ్చేస్తున్నప్పుడు 'అమ్మా' అని ఆర్తిగా అరిచి 'నన్నెత్తుకో' అన్నట్టు

చేతులు చాచి ఏడుస్తుంటే కడుపు తరుక్కుపోయింది. చప్పున పిల్లని అందుకొని, గాఢంగా హత్తుకొని ముద్దులాడింది. ఇంతలో కర్తవ్యం గుర్తుకు వచ్చింది. బల్లిలా తనని కరుచుకుపోయివున్న పాపని ఆయాకందించేసి ఉబికి వస్తున్న దుఃఖాన్ని అదిమిపెట్టుకొని- చకచక బయటికి వచ్చేసింది. 'అమ్మా....' అంటూ పాప గుక్కపట్టి ఏడవడం చెవుల్లో హోరుమని వినిపిస్తూనే ఉంది.

పిల్ల ఆలనా పాలనా అన్నీ హోమ్ వాళ్ళే చూసుకుంటున్నారు. "ఎంత కావాలంటే అంతా పంపిస్తాను, పిల్ల హాయిగా ఏ లోటూ లేకుండా పెరిగేటట్టు చూడండి" అని చెప్పింది నిర్వాహకులకి.

పాపని చూడ్డానికి ఆర్నెల్లకోసారి తప్పకుండా వెళ్ళేది. వెళ్ళినప్పుడల్లా ఆశ్చర్యపోతూ ఉండేది. కారు నలుపు రంగయితేనేం ముఖకవళికలు, ముక్కూ నోరూ అన్నీ తీర్చిదిద్దినట్టుగా పూర్తిగా తన పోలికలు, తండ్రి పోలికలూ కలబోసి మరీ కనబడుతున్నాయి. పిల్ల చాలా చురుకైందట... ఆయాలు అంటుండేవారు. పిల్లంటే అందరికీ ముద్దేనట హోమ్‌లో.

"ఎలా వస్తున్నాయో తెలీడం లేదు గాని- మంచి మేనర్స్, నవ్వినా ఎంతో నిదానంగా, చిన్నగా నవ్వుతుంది" అన్నారు ఆయాలు.

మరోసారి వెళ్ళినప్పుడు చెప్పారు "పాప కళ్ళు నిత్యం ఎవర్నో వెతుకుతున్నట్టు కనిపిస్తుంటాయి" అని. ఆ మాట వినగానే గుండె తరుక్కుపోయింది తల్లికి. "చుట్టూ ఉన్న వాళ్ళని చూస్తూ మా అమ్మ ఎవరు చెప్మా- అని కాబోలు ఆ కళ్ళు వెతుకుతున్నాయి" అనుకుంది. ఆ మాటే అడిగింది పాప- కొన్నాళ్ళు పోయాక. అప్పటికి మాట్లాడ్డం బాగా వచ్చేసింది. కొంచెం జ్ఞానం కూడా వచ్చింది. "ఆంటీ మా అమ్మవి నువ్వేనా?" అంది.

ఆ పిల్ల గొంతుకలో, కళ్ళల్లో ఆత్రంగా నిరీక్షణ- "అవును, నేనే మీ అమ్మని" అనే సమాధానాన్ని వినడం కోసం.

"అమ్మని కాదు- ఆంటీని" ఎంతటి ఉద్వేగాన్నో అణచి పెట్టుకోవలసి వచ్చింది అలాంటి నిర్దయతో కూడిన సమాధానం ఇవ్వడానికి.

పాప చాలా నిస్పృహకి గురైనట్టు కనిపించింది ఆ సమాధానం విని. నమ్మలేనట్టుగా కనిపించింది ఆమె చూపు. 'ఇంకా ఎంతకాలం ఇలా ఉండాలో మా అమ్మని కనుక్కోవడానికి' అన్న భావన కూడా ఉందేమో ఆ పాప చూపుల్లో.

చదువులోను, ఆటపాటల్లోను, డాన్సుల్లోను... ఇలా అన్నిటోనూ అరుదైన ప్రతిభ కనబరుస్తోందట పాప... హోమ్ వాళ్ళు రాసారు రిపోర్టులో. పెరిగి పెద్దదయింది.

చివరికి- అందరూ ఈర్ష్యపడేంత మంచి క్వాలిఫికేషన్ సంపాదించి బాగా ఆదాయం వచ్చే ఉద్యోగంలో చేరింది. తీరికవేళల్లో ఫ్రీలాన్సర్‌గా కూడా బాగా డబ్బు సంపాదిస్తోందట.

తల్లి ఇప్పుడు హోమ్‌లో ఉంటోంది ఆరోగ్యం సరిగా లేక. డబ్బు ఎంత ఉంటేనేంగాక- నా అని చెప్పుకోవడానికీ, దగ్గర కూర్చొని ప్రేమగా రెండు మాటలు చెప్పడానికీ ఎవరూ లేరు.

పాప ఒక కంపెనీకి సిఇఒ అయింది. తనకి వచ్చిన పదోన్నతిని ఘనంగా సెలబ్రేట్ చెయ్యడానికి విలాసవంతమైన పార్టీ ఏర్పాటు చేసింది. పార్టీకి ఆంటీ

**నేను నీ కూతుర్నెలా అవుతాను ఆంటీ? మీరు తెల్లని తెలుపు, నేను నల్లని నలుపు. మనం తల్లీపిల్లలం ఎలా అవుతాం? అయినా నేను నీ తల్లిని అన్నారు. ఆ మాట చాలు నాకు. ఇన్నాళ్ళూ నేను అనాథనని అనుకుంటూనే బతికేను. మీ మాట వింటుంటే నేను అనాథను కాను, నాకూ కావలసిన వాళ్ళు ఉన్నారు అనే భరోసా కలుగుతోంది మనసులో. ఆ భావన మనసును నిండుగా ఉండేట్టు చేస్తుంది కదా ఆంటీ!? మీకేం పర్వాలేదు ఆంటీ... మీకెవరూ లేరని నిరాశ పడకండి. మీకు ఏ ఇబ్బందీ కలగకుండా నేను చూసుకుంటాను.**

వస్తుందని ఎదురుచూసింది. కానీ ఆమె రాలేదు. తరువాత తెలిసింది. ఆంటీ ఓల్డేజ్ హోమ్‌లో ఉందని, ఆరోగ్యం బాగాలేదని.

వృత్తి వ్యాపకాలు, పోటీలుపడి పైకి చేరుకోవాలనే ప్రయత్నాలు... వీటిలో పడి ఏడాదయిందో, రెండేళ్ళయిందో ఆంటీని చూడ్డానికే అవలేదు. కొత్త బాధ్యతలూ, బిజీ షెడ్యూళ్ళూ... తీరుబడి అన్న మాటే లేదు. చివరికి ఎలాగో తీరిక చేసుకుని ఓల్డేజ్ హోమ్‌కి వెళ్ళింది ఆంటీని చూడ్డానికి.

కూతుర్ని చూస్తూనే ఆశ్చర్యపోయింది తల్లి. పిల్లలో అచ్చుగుద్దినట్లు తన పోలికలు, విడిపోయిన భర్త పోలికలూ నోట మాట రాలేదు. రంగు మాత్రం ఇప్పటికీ కారునలుపే. అయితేనేం? ద్రౌపదీ, క్లియోపాత్రాలు నలుపేనట. అయినా జగదేక సౌందర్యవతులట! అలాగే- ఈ పిల్ల కూడాను. ఇక ఎంతమాత్రం తనను తాను అదుపు చేసుకోలేక "నేనేనమ్మా నీ అమ్మని" అంది తల్లి.

పిల్ల పెదవుల మీద చిరునవ్వు. అది వ్యంగ్యమో, ఆశ్చర్యమో బోధపడలేదు తల్లికి. చివరికి సంగీతంలా ధ్వనించే గొంతుకతో

"నేను నీ కూతుర్నెలా అవుతాను ఆంటీ? మీరు తెల్లని తెలుపు, నేను నల్లని నలుపు. మనం తల్లీపిల్లలం ఎలా అవుతాం? అయినా నేను నీ తల్లిని అన్నారు. ఆ మాట చాలు నాకు. ఇన్నాళ్ళూ నేను అనాథనని అనుకుంటూనే బతికేను. మీ మాట వింటుంటే నేను అనాథను కాను, నాకూ కావలసిన వాళ్ళు ఉన్నారు అనే భరోసా కలుగుతోంది మనసులో. ఆ భావన మనసును నిండుగా ఉండేట్టు చేస్తుంది కదా ఆంటీ!?"

"మీకేం పర్వాలేదు ఆంటీ... మీకెవరూ లేరని నిరాశ పడకండి. మీకు ఏ ఇబ్బందీ కలగకుండా నేను చూసుకుంటాను. అన్ని సదుపాయాలూ ఏర్పాటు చేయిస్తాను. నేను మీ కూతుర్ని కాకపోయినా నన్ను మీ కూతురే అనుకోండి. అలా అనుకుంటే loneliness ఫీలవరు. నాకు ఎవరూ లేరనే భావంతో నేనెంత lonelyగా ఫీలయ్యానో నాకు తెలుసు. అందుకనే అంటున్నాను మీరూ నాలాగ ఒంటరిదాన్ననే భావంతో బాధపడకూడదు."

"అఫ్‌కోర్స్, నన్ను చూడ్డానికి ఆర్నెల్లకోమారు వస్తుండేవారనుకోండి. కానీ ఆంటీ ఆంటీనే అమ్మ కాదు కదా! నేను హోమ్‌లో ఉన్నపుడు తల్లిదండ్రులు వచ్చి వాళ్ళ పిల్లల్ని కావలించుకొని ఒళ్ళో కూర్చోబెట్టుకొని ముద్దు చేస్తుంటే నేను దుఃఖాన్ని ఆపుకోలేక దూరంగా పారిపోయి ఏడ్చేదాన్ని. నాకు కలిగిన దుఃఖంలాంటిదే మీకూ కలగొచ్చు కదా! మనసులో 'అయ్యో! నన్ను చూడ్డానికి ఒక కూతురైనా లేదే' అని అనిపించవచ్చు."

"నా కోసం ఎంతో ఖర్చుపెట్టి నన్ను ఇంత అభివృద్ధిలోకి తెచ్చారు. ఆంటీ! నాకు ఆ కృతజ్ఞతాభావం ఉంది. నేను మీ జాతిదాన్ని కాకపోయినా మీరు నాకు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యాలి. అది నా ధర్మం. అంచేత ఆంటీ... మీకు ఏ సాయం అవసరమైనా నిస్సంకోచంగా నాకు ఫోను చెయ్యండి. నాకు వీలయినప్పుడల్లా వచ్చి మిమ్మల్ని చూస్తుంటాను. నన్ను మీరు కనకపోయినా, నేను మీ కూతుర్ననే అనుకోండి. అలాటి ఫీలింగ్ వల్ల మీకూ నాకూ కూడా నిండుగా ఉంటుంది. సరే అంటీ- మరి నేను వెళ్ళిరానా? నా ఫ్లయిటుకి టయమవుతోంది" అనేసి నిండుగా, హుందాగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది ఆ నల్లకలువ.

● ఈ కథకి ప్రేరణ- నోబెల్ బహుమతి గ్రహీత Tony Morrison రాసిన ప్రసిద్ధమైన sweetness కథ.

రచయిత సెల్ : 98483 75179

## కొత్త పుస్తకాలు

# నాటకీయతే ఆయువుపట్టు

కొంతమంది రచయితలపై వారు ఒక తరహా రచనలు మాత్రమే చేయగలరన్న ముద్ర పడిపోతూ ఉంటుంది. 'శ్రీవారికి ప్రేమలేఖ' (జంధ్యాల) విడుదల తర్వాత ఆ సినిమాకు మూలకథ అందించిన పొత్తూరి విజయలక్ష్మి కూడా హాస్యం తప్పించి సీరియస్ కథలు రాయలేరేమో అనుకుంది సాహితీలోకం. తాజాగా ఇప్పుడు విడుదలైన ఆమె 'పూర్వి' కథలు చదివితే ఆ అభిప్రాయం మార్చుకోక తప్పదు. కాకపోతే నవ్వించే కాదు ఏడ్పించి కూడా పాఠకుల కళ్లనుంచి నీళ్ల తెప్పించగలిగే చాతుర్యం ఆమె కలానికి ఉందని గుర్తిస్తాం. 250 కథలు, 20 నవలలు రాసిన రచయిత్రి రచనలు ఎలా ఉంటాయి? అలవోకగా చదివిస్తాయి - ఆలోచనలు రేకెత్తిస్తాయి. అందుకివి భిన్నం కాదు కూడా. ఈ 16 కథల్లో చెప్పుకోదగ్గ కథ 'పూర్వి'. పూర్వి ఈశాన్య భారతంలో పుట్టి పెరిగిన బీద యువతి. అనుకోని పరిస్థితుల్లో ఒక తెలుగబ్బాయిని పెళ్లి చేసుకోవడం, భర్త ప్రమాదంలో మరణించాక, పరిహారంగా అందిన డబ్బుని భర్త తల్లిదండ్రులకే అప్పగించాలనే మంచి మనస్సుతో వారిని వెతుక్కుంటూ తెలుగునేలకు రావడం .. నాటకీయతనే కథకు ఆయువుపట్టుగా వాడుకున్నా చదివినంతసేపు ఒక ఉత్కంఠ, ఆర్ద్రతని కలిగిస్తారు రచయిత్రి. 'సుఖాంతం', 'ప్రేమికుల రోజు', 'శ్రీదేవమ్మగారి మామిడితోరణం' వంటివి వినోదంతో పాటు విలక్షణతను సంతరించుకుని నల్లేరుమీద నడకలా చదివిస్తాయి.



**పూర్వి** (కథలు), పొత్తూరి విజయలక్ష్మి
**పేజీలు:** 130, **వెల :** రూ.120,
**ప్రతులకు :** 040 - 2763 7729

---

# ప్రశ్నలు లేవనెత్తే కథలు

సంప్రదాయ భావనలకీ, ఆధునిక సమస్యలకీ మధ్య గల వ్యత్యాసాన్ని పూదండలో దారంలా పైకి కనిపించనట్టుగా కథ నడిపిస్తారు శ్రీవల్లీ రాధిక. 'హేలగా .. ఆనంద డోలగా..' సంపుటిలోని కథలన్నీ దాదాపు అలాంటివే. ముఖ్యంగా 'వివక్షస్థ', 'హేలగా .. ఆనంద డోలగా' కథల్లో ఆమె తీర్చిదిద్దన పాత్రలు, వాటి స్వభావాలు పరిశీలిస్తే రచయిత్రి ఆలోచనలు అర్థమైపోతాయి. 'ఏ సమస్యలూ, బాధలూ మనల్ని తాకని స్థితి, మరో ఆలోచన మనకి రాని స్థితి .. దానిని కళలు మాత్రమే ఇవ్వగలవు' వంటి చింతనాత్మక సంభాషణలు పాఠకుల్ని కట్టిపడేస్తాయి. లోలోతుగా ఆలోచించేలా చేస్తాయి. సాధారణ ఇతివృత్తం అనుకునే కథలో సైతం అంతర్లీనంగా ఇంకేదో దాగివుందనే భావం మనలో కలిగిస్తారు రచయిత్రి. పాత్రల మధ్య జరిగే వాగ్వివాదాలు పాఠకుడు ఎటు వైపున ఉన్నాడో ఆలోచించుకోమన్నట్టు ఉంటాయి. రచయిత్రి భావజాలంతో ఏకీభవించినా ఏకీభవించకపోయినా పాఠకుల్ని విస్మయపరిచి ఆలోచనా స్రవంతిలో కొట్టుకుపోయేలా చేస్తూ 'నేనేమిటి?' అనే ప్రశ్నను తనకు తానుగా వేసుకునేలా చేయించే కథలివి.




**హేలగా .. ఆనంద డోలగా ...** (కథలు),
టి.శ్రీవల్లీ రాధిక, **పేజీలు :** 152, **వెల :** రూ. 150
**ప్రతులకు :** 040 - 2412 4124

# క్లుప్తత, గాఢతలే బలం




రాయలసీమ కథకుల్లో విలక్షణమైన రచయితగా కలువకొలను సదానందకు పేరుంది. ముఖ్యంగా ఆయన పేరు వినగానే గుర్తుకొచ్చేది బాలసాహిత్యం. పిల్లల కథలు రాసే రచయిత మనసు ఎంత స్వచ్ఛతగా ఉంటుందో ఈ 'పరాగభూమి' కథలూ అంతే స్వచ్ఛతగా, నిజాయితీగా ఉన్నాయి. 60 ఏళ్ల కాలంలో మిగిలిపోయిన 20 కథల్ని పరిగ ఏరినట్టు ఏరి సంపుటిగా తీసుకొచ్చారు. స్పందించే హృదయంతో, భావుకతతో, అనుకంపతో, వ్యంగ్యవైభవంతో రాసిన కథలివి. 'తోడొకరుండిన అదే భాగ్యము', 'ప్రేమామృతము', 'నా చిన్ని రబ్బరు', 'త్రివర్ణ స్వప్నం' వంటి కథలు మధ్య తరగతి జీవితపు వ్యక్తిత్వాల్ని అద్భుతంగా ఆవిష్కరిస్తాయి. 'పగలు అనే మగవాడు వెలుతురనే ఆడదాన్ని తీసుకుని పడమటి కొండల చాటుకు తీసుకెళ్తున్నట్టు మలిసంజ', 'అది చిర్నవ్వు కాదు వెన్నెల తుళ్లింత, జలపాతపు తుంపర' వంటి వాక్యాలు ఆయనలోని భావుకతను; "గుండ్రని పిరుదుల మీద పొడవాటి జడ పాములా ఎగిరెగిరి కాటు వేస్తోంది' వంటి వాక్యాలు ఆయనలోని రసస్ఫోరకతను; 'సీతాకోక చిలుకను గిస్తే గండబేరుండ పక్షి అయింది' వంటి వాక్యాలు ఆయనలోని వ్యంగ్య వైభవాన్ని పట్టిస్తాయి. పాఠకుడిలో కొత్త ఉత్సాహం నింపుతూ ముందుకు తీసుకువెళ్తాయి. వాక్యాల్లో క్లుప్తత, గాఢత కథకు బలంగా అనిపిస్తాయి. 1958 నుండి 2009 మధ్యకాలంలో ప్రచురించబడ్డ ఈ కథలు 50 ఏళ్ల కాలవ్యవధిలో వచ్చిన ఆర్థిక, రాజకీయ మార్పులతో పాటు మనుషుల ఆచార వ్యవహారాల్లో వచ్చిన మార్పుకూ అద్దం పడతాయి.

**పరాగభూమి** (కథలు), కలువకొలను సదానంద
**పేజీలు :** 220, **వెల :** రూ. 150, **ప్రతులకు :** 94409 95010

తహిరో

---

# దిల్దార్ కథలు

ఏ రచయితకైనా తన స్వీయానుభవాలను కథలుగా అల్లడం తేలికే. ఒకవేళ తెలియని జీవితాల జోలికి వెళ్లినా రచయితకంటే పాఠకులు తెలివైన వాళ్లు కాబట్టి ఇట్టే పసిగట్టేస్తారు. ఇప్పటికే 50కి పైగా కథలు రాసిన దిలావర్ మరో 15 కథలతో 'చంద్రుడు గియ్యని బొమ్మలు' సంపుటి తెచ్చారు. ఇవన్నీ ఆయన అనుభవాలు కానప్పటికీ ప్రతి కథలో తానొక పాత్రయినట్టు అత్యంత సహజంగా పరిశోధించి రాశారు. ఉదాహరణకు 'మరో శాకుంతలం' కథ ఒక్కటి చాలు ఆ కథ రాయడం వెనక ఆయన పడ్డ శ్రమ ఎంతో తెలియడానికి. తన జీవితానికి ఏమాత్రం సారూప్యత లేని ఇతివృత్తం ఇది. లంబాడీల జీవితాన్ని ఎన్నుకుని వారి ఆచార వ్యవహారాలతో పాటు ఆహార్యం, భాషను సైతం కళ్లకు కట్టినట్టు చిత్రించారు. నాగరీకుడిని నమ్మి మోసపోయిన గిరిపుత్రిక వేదనను ఆర్ద్రతతో చెప్పారు. అడవిని అబ్బురపడే రీతిలో అందంగా వర్ణించారు.

అన్నీ వర్తమాన వస్తువులు కానప్పటికీ పడుగుపేకల్లాంటి శైలి, శిల్పాలు కథలను హాయిగా చదివిస్తాయి.



**చంద్రుడు గియ్యని బొమ్మలు** (కథలు), డా. దిలావర్
**పేజీలు :** 197, **వెల :** రూ.100
**ప్రతులకు :** 98669 23294

## కొత్త పుస్తకాలు

# సమాజం బడిలో తయారైన రచయిత

ప్రసిద్ధ కథా, నాటక రచయిత సింగరాజు లింగమూర్తి భాష, శైలి విభిన్నంగా ఉంటాయి. ఈ సంస్థ రెండు సంపుటాల్లో ఉన్న యాభైకి పైగా కథలు చదివినవారికి ఆయన భాష మీదా, శైలి మీదా తప్పకుండా అభిమానం ఏర్పడు తుంది. 1943 నుంచి 1973 వరకు ఆయన రాసిన కథల్లో ముఖ్యమైన కొన్నిటిని ఎంపిక చేసి ఈ రెండు సంపుటాలను తీసుకొచ్చారు. మధ్యతరగతి చికాకులు, ఆలోచనలు, జీవన విధానాలు, నీతి నిజాయతీలు, మానవ విలువలే ఆయన కథలకు ప్రధాన ఇతివృత్తాలు. ఆయనకు బ్రిటిష్‌వారి పాలనా కాలం కొంత స్ఫూర్తినివ్వగా, స్వతంత్ర భారతదేశం మరికొంత స్ఫూర్తినిచ్చింది.




సింగరాజు లింగమూర్తి పేరు వినగానే చాలామందికి గుర్తుకు వచ్చే కథ 'తెగిన జోడు'. ఇది మొదటి సంపుటంలో ఉంది. కాలి చెప్పు తెగితే ఓ మధ్యతరగతి కుటుంబీకుడు ఏ విధంగా అవస్థ పడేదీ ఈ కథ వివరిస్తుంది. హాస్యం, విషాదం సమ్మిళితమైన కథ ఇది. ఓ పేద రిక్షావాడి ఆత్మాభిమానానికి అద్దం పట్టే 'నీతి చంద్రిక', స్వాతంత్ర్యోద్యమ ధుని విషాద జీవిత వృత్తాంతం 'ఆత్మవంచన', పగలు ప్రభుత్వోద్యోగం చేస్తూ, జీతం సరిపోక రాత్రిళ్లు రహస్యంగా రిక్షా తొక్కిన వ్యక్తి కథ 'విచ్ఛిత్తి' ... ఈ కథలన్నీ మానవీయ విలువలను కళ్లకు కడతాయి. రెండో సంపుటంలో... అక్రమ సంబంధాలపై రాసిన 'రాలిన క్షణాలు', ఆఫీసులో పనిచేసే ఓ మహిళ పట్ల పురుషుల దృష్టి కోణాన్ని వివరించే 'ఆమె నేర్చిన తీరు', తాగుడుకు బానిసైన యువకుడి తీరును ఇతివృత్తంగా తీసుకున్న 'భిన్నత్వంలో ఏకత్వం'... తదితర కథలు ఆసక్తిగా చదివిస్తాయి.

అయితే దాదాపు నాలుగున్నర దశాబ్దాల క్రితం నాటి కథలు చదువుతున్నప్పుడు వాటి ఇతివృత్తాలు, శిల్పం కాలం చెల్లిపోయినవని అనిపించకమానదు. కానీ, ఇందులోని సమస్యలు, సామాజిక అంశాలన్నీ ఇప్పటి కాలానికీ వర్తిస్తాయనడంలో సందేహం లేదు. అంతేకాదు, ఈ కథలన్నిటిలోనూ సమాజాన్ని మార్చాలనే ఓ తాపత్రయం అంతర్లీనంగా ద్యోతకమవుతూనే ఉంటుంది. ఈ కథల్లో కనిపించే మానవీయ కోణాలు, మానవీయ విలువలు బహుశా మరే రచయిత కథల్లోనూ కనిపించి ఉండక పోవచ్చు కూడా. డాక్టర్ ఏటుకూరి ప్రసాద్ అన్నట్టు, "సింగరాజు లింగమూర్తి సమాజం బడిలో తయారైన రచయిత."

**- జి. రాజశుక**

**సింగరాజు లింగమూర్తి రచనలు**
కథలు (రెండు సంపుటాలు) **పేజీలు:** 243, 270,
**వెల :** రూ.170, 175, **ప్రతులకు:** నవచేతన, ప్రజాశక్తి

---

# అలనాటి అపురూప కథలు




లెవ్ తల్‌స్తోయ్, చేహవ్, వోల్టేర్, మొపాస, ఓ.హెన్రీ, రస్సెల్, గోర్కీ, డికెన్స్, మార్క్‌ట్వైన్ వంటి ప్రపంచ ప్రసిద్ధ కథకుల పేర్లు ఈ తరం వాళ్ళు సైతం వినే ఉంటారు. కొన్ని కథలను క్లాస్ పుస్తకాల్లో కూడా చదువుకుని ఉండొచ్చు. వాళ్ళు రాసిన మరిన్ని మంచి కథలను చదువుకునే అవకాశం కల్పిస్తోంది 'పీకాక్ క్లాసిక్స్'. 'ఒక మంచి బ్రాహ్మణుని కథ, మరో డజను కథలు', 'నెక్లెస్ మరికొన్ని ఇతర కథలు' పేరిట వెలువరించిన ఈ రెండు పుస్తకాల్లో మొత్తం 24 కథలున్నాయి. గోర్కీ 'దేశద్రోహి తల్లి', మొపాస 'నెక్లెస్', ఓ.హెన్రీ 'ఇరవై ఏళ్ళ తర్వాత', చేహవ్ 'ప్రభుత్వ గుమస్తా మరణం' వంటి పాపులర్ కథలతో పాటు వోల్టేర్ 'ఒక మంచి బ్రాహ్మణుడి కథ', తల్‌స్తోయ్ 'రెండు దారులు', రస్సెల్ 'సృష్టి' కథలు తర్కానికి పదునుపెడతాయి. తమకు తాము ఉన్నతులమని భావించేవారు కొన్ని సందర్భాల్లో ఎంత నీచంగా ప్రవర్తించగలరో మొపాస 'బౌల్ డి సూయిఫ్' వెల్లడిస్తుంది. రోవాల్ డాల్ 'కబేళాకి మేకపిల్ల', డికెన్స్ 'సిగ్నల్ మాన్', లారెన్స్ 'అదృష్టవంతుడు' కథలు ఊహించని మలుపులతో ఆసక్తికరంగా సాగుతాయి. వీటిలో ఎక్కువ కథలను బీనాదేవి అనువదించారు. తల్‌స్తోయ్, చేహవ్ రెండు కథలను డాక్టర్ భూపతిరాజు రమేష్ చంద్రబాబు నేరుగా రష్యన్ నుంచి అనువదించడం విశేషం. అపురూపమైన ఈ అనువాద కథలను తెలుగు పాఠకులందరూ తప్పకుండా చదవాల్సినవి. అనువాదాలు కూడా బాగున్నాయి.




**- దేరా**

**ఒక మంచి బ్రాహ్మణుని కథ, మరో డజను కథలు**
**పేజీలు :** 80, **వెల :** రూ.50
**నెక్లెస్ మరికొన్ని ఇతర కథలు**
**పేజీలు :** 128, **వెల :** రూ.80,
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

---

# మిస్సమ్మ, బాటసారి మూలకథలు




తమకు నచ్చిన కథలను పరభాష నుంచైనా తీసుకుని సినిమాలు నిర్మించిన దర్శకులు, నిర్మాతలు మొదటి నుంచీ మనకున్నారు. ముఖ్యంగా తెలుగుపై బెంగాలీ సాహిత్య ప్రభావం ఎప్పటి నుంచో ఉంది. అలా తీసుకున్న రెండు బెంగాలీ కథలను మిస్సమ్మ, బాటసారి సినిమాలుగా మలిచారన్న విషయం కొద్దిమందికే తెలిసి ఉంటుంది. ఆ రెంటి మూల కథలను చిన్న పుస్తకాలుగా ప్రముఖ ప్రచురణ సంస్థ పీకాక్ బుక్స్ వెలుగులోకి తీసుకువచ్చింది. డైలాగుల రూపంలో మిస్సమ్మను, కథగా బాటసారిని వెలువరించింది. ఉద్యోగం కోసం భార్యాభర్తలమని నాటకమాడిన యువతీ, యువకుడి కథ మిస్సమ్మ. బాగా చదువుకున్నప్పటికీ లోకజ్ఞానం లేని, సొంతంగా తనకుగా తాను ఏమి చేసుకోలేని యువకుడి కథ బాటసారి. అచ్చంగా ఈ కథల్లానే ఆ సినిమాలు ఉండవు. మన పరిస్థితులకు అనుగుణంగా చాలా మార్పులు చేశారు. కాపీ కొట్టడంలో మనవాళ్ళు సిద్ధహస్తులన్న విమర్శ ఒక కోణం మాత్రమే. మూలకథకు నష్టం కలుగకుండా, తెలుగువారి మన్ననలు పొందేలా సృజించడమే ఇక్కడ గుర్తించాల్సిన విషయం. ఈ రంగంలో పాత తరానికి చెందిన నిష్ణాతులు ఎవరైనా ఉండి మాట్లాడితే, ఈ కథలనే ఎందుకు ఎంచుకున్నారు, ఆయా మార్పులు ఎందుకు చేశారో తెలుస్తుంది. ఆ విషయాలకు తోడు సినిమా కథను కూడా సంక్షిప్తంగా జోడించి ఉంటే మరింత బాగుండేది. ముందుముందు అలాంటి ప్రయత్నం చేస్తారని ఆశిద్దాం.




**- మద్దిపట్ల మణి**

**మిస్సమ్మ**, **మూలం:** రబీంద్రనాథ్ మైత్రా (మన్మోయీ గర్ల్స్ స్కూల్),
**తెలుగు:** చక్రపాణి, **పేజీలు:** 64, **వెల:** రూ.40
**బాటసారి**, **మూలం:** శరత్‌చంద్ర చటర్జీ (బడదీది),
**తెలుగు:** అరుణశ్రీ, **పేజీలు:** 62, **వెల:** రూ.40
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

